# ఆలిండియా అడుక్కుతినేవాళ్ళ మహాసభ



తాపీ ధర్మారావు

# ఆలిండియా అడుక్కుతినేవాళ్ళ మహాసభ

తాపీ ధర్మారావు

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
చంద్రంబిల్డింగ్సు విజయవా[illegible]004



# చిన్న మనవి

రైళ్ళలో, పుణ్యక్షేత్రాలలో, అంగళ్ళలో హోటళ్ళ దగ్గర... ఎక్కడ చూచినా కనబడతాడు బిచ్చగాడు - విశ్వవ్యాప్తిగా. ఈ ముష్టివాళ్ళిలా వీధులలో కనబడడం దేశానికి కళంకం వంటిదని పెద్ద లన్నారు. కొన్ని దేశాలలో ప్రభుత్వాలు వీళ్ళను గురించి శ్రద్ధ తీసుకొని, మచ్చుకైనా ముష్టివాడు తమ దేశంలో కనబడకుండా ఏర్పాట్లు చేశారు. ధర్మక్షేత్ర మనుకునే మన భారతదేశానికి, ఈనాటికీ గూడా, ఆ అదృష్టం కలగలేదు. ఇది చింతాకరమని చెప్ప నక్కరలేదు.

ఈ ముష్టివారి సమస్యను గూర్చి ఆలోచించని సహృదయు లుండరు. ఈలాగున ఉన్నందుకు దుఃఖించని దేశభక్తు లుండరు. ఇతర దేశాలలో కానరాని ఈ దురవస్థ మనకు కలిగినందులకు లజ్జ పొందని ఉదార స్వభావు లుండరు.

అందరూ సమానంగా ఉండవలసిన మానవ సమాజంలో ముష్టి ఎత్తుకోవలసిన గతి ఎందుకు వచ్చింది ? అని నేనూ ఆలోచించాను.

ఇరవై యేళ్ళ క్రితం "అడగజాలనివాడు" అన్న పేరుతో, ఈ అడుక్కోవడం గురించి కొన్ని వ్యాసాలు "కాగడా" పత్రికలో ప్రచురించాను. ఆ వ్యాసాలు పాఠక మహాశయుల అభిమానాన్ని సంపాదించ గలిగాయి మిత్రులు పుస్తక రూపంగా ప్రచురించ మన్నారు. తరువాత "అడుక్కుతినే ముష్టివాళ్ళు" అన్న శీర్షికతో కొన్ని "యధార్థ కథలు", ప్రచురించాను. ఆ వెనుక "ఆలిండియా అడుక్కుతినేవాళ్ళ మహాసభ" అన్న శీర్షికతో ఒక వ్యాసం "దుష్టబుద్ధి" అన్న పేరుతో జనవాణి (వారపత్రిక) జన్మదిన సంచికలో, వ్యంగ్య రచనగా ప్రచురించాను. వీటన్నిటిని కలిపి ఇప్పుడీ గ్రంథ రూపంగా ఆంధ్ర సహృదయులకు సమర్పించు కుంటున్నాను.

సమస్య యేదయినా, కొంచెము సందర్భం చూచుకొని, సాహిత్య పరిచయం పాఠకులకు కలిగేలాగా వ్రాయడం నాకు చిరకాలాభ్యాసము. కాబట్టే, అడగజాలనివాడి వ్యాసాలలో కొందరు కవుల సుభాషితాలు ప్రవేశించాయి. సహృదయులు హర్షించక పోరనే నా నమ్మకం.

మానవ సమాజంలో మత ప్రాబల్యం కలిగినప్పుడు "దానాలు" సర్వ సాధారణంగా అవతరిస్తాయి. మన దేశంలో మాత్రమే కాదు; అన్ని దేశాలలోనూ అన్ని మతాలలోనూ అవి వ్యాపించాయి ప్రీస్టులకూ, మతాధికారులకూ. మరాధికారులకూ దానాలి స్తే, చేసిన పాపాలన్నీ పరిహరించుక పోతాయన్న నమ్మకం ఇప్పటికీ అక్కడక్కడ కనబడుతుంది. దానం ఒక సదుపాయ మయింది; ధర్మచింత లేకపోయింది. దీనిని గురించి కొంత నొక్కి చెప్పాననంటే అది మత విద్వేషం వల్ల కాదనీ, జన సామాన్య శ్రేయోభిలాష వల్లనే అనీ భావించవలసిందని ప్రార్థన. చీనా, రష్యా మొదలయిన దేశాలను చూచి వచ్చిన మన భారతీయ ప్రముఖులు చెప్పిన మాటలను పట్టి చూస్తే ఆ దేశాలలో ముష్టి వాడెక్కడా కనబడడని తేటపడుతుంది. మన దేశంలో గూడా ఇలా ఎందు కుండగూడదు? అన్న హృదయావేదనే ఈ రచనలకు కారణమని మనవి చేస్తాను.

నిజమే? కాలూ చెయ్యీ బాగుండీ, ముష్టి ఎత్తడానికి "యోగ్యత" లేనివారు చాలామంది ముష్టివాళ్ళలో కనబడతారు. తగిన యేర్పాట్లు చేసి, అటువంటి వారికి పనులు కల్పించినట్టయితే దేశాభ్యుదయానికి దోహదం చేసిన వారమవుతాము. గత్యంతరం లేనివారికి, విధిగా కూడూ గుడ్డా వసతీ కల్పించాలి. దేశంలో ధనం లేకపోలేదు. కావలసిన దంతా హృదయం; భారత భూమి సుంద రాకారం మీద కళంకం లాగా ఉన్న ఈ దుర్గతిని తొలగించాలన్న సదభిప్రాయం కావాలి, అంతే!

హైదరాబాదు,
21-10-1961.

సెలవు
తాపీ ధర్మారావు

# దీనిలో

# ఆలిండియా
# అడుక్కుతినేవాళ్ల మహాసభ



అది అంధకరాజ్యం; చెవుడూరు; రప్పలబీడు మైదాసం. కనుచూపుమేరకు జనం కిక్కిరిసిఉన్నారు. ఎంతమం దొచ్చారో ఎవడూ లెక్కపెట్టలేదు.

అడుక్కుతిన్నోళ్ళలో భీష్ముడులాంటి దమ్మన్న అధ్యక్షుడు. ఉత్సాహపూరితుడు, నవయువకుడు సూరన్న ఆహ్వాన సంఘాధ్యక్షుడు. చచ్చిన పెద్దలు చాలామంది సందేశాలు పంపించారు.

ఆలిండియా అడుక్కుతినేవాళ్ళ మహాసభకీ జై!

ఆహ్వాన సంఘాధ్యక్షుడు సూరన్న వేదికబండ దగ్గర కెళ్ళాడు. చేయె త్తేసరి కంతా సద్దుమణిగిపోయింది.

## సూరన్న ఉపన్యాసం

సోదర అడుక్కు-తినే మహాయ్యలారా, హోల్ ఇండియాలో అడుక్కు-తినే వాళ్ళ మంతా ఇలా మహాసభ చెయ్యడం ఎప్పుడూ జరగ లేదు. అంగ వంగ కళింగ అనే ఛప్పన్న దేశాల ప్రతినిధు లింతమంది ఈ మహాసభకు హాజరు కావడం చాలా చాలా గొప్ప సంగతి.

ఇటువంటి మహాసభకు పెద్దగా ఉండడానికి తగిన వోడు మన దమ్మన్నే అని మీరంతా ఒప్పుకుంటారు. దమ్మన్న సామాన్యుడు కాదు. సుమారు యాభై సంవత్సరాలు అడుక్కు-తిన్న అనుభవం ఉన్నోడు. కడుపు సేత పట్టుకొని. ఎడతెరిపిలేకుండా, దేశమంతా సుట్టుకొచ్చినోడు, అంతేకాదు, అయిదారు తరాలనుంచీ, ఈ దమ్మన్న తాత ముత్తాత అంతా అడుక్కు-తిన్న పెద్దలే. ఇటువంటోడు మన సభా పెద్దగా దొరకడం మన అదృష్టం. అడుక్కు-తినేవోళ్ళు యెవరో, యెందరో, ఈళ్ళ కున్న హక్కు లేమిటో, తక్కు-న ప్రజలు ఈళ్ళకేమి సెయ్యాలో, దొరతనం సెయ్యవలసిం దేంటో ఆ సంగతులన్నీ దమ్మన్న తెలియజేస్తాడు. మీరంతా సద్దు సెయ్య కుండా శర్దగా యినాలనీ, మనకు కావలసిన తీరుమానాలు సక్కగా సెయ్యా లనీ మిమ్మలి నందరిని కోరుకుంటాను.

చప్పట్లు
మరీ మరీ దమ్మన్నే !
దమ్మన్నకీ జేయ్ !
అడుక్కు-తినోన్ళు జిందాబాద్ !
ఆలిండియాకు జేయ్ !
అడుక్కు-తినోన్నిళ్ళకూ జేయ్ !

అన్న నినాదాలు మిన్ను ముట్టాయి.

దమ్మన్న లేచాడు, కర్రా బొచ్చె అక్కడ పెట్టి. చీమ చిటుక్కు మనలేదు. ఏడవనుండే చిన్నపిల్ల నోటిలో బలవంతాన చన్నొకటుక్కింది తల్లి.

## దమ్మన్న ఉపన్యాసం

అడుక్కుతినే సోదరులారా !

ఈ సివరనుంచి ఆ సివరదాకా కూచొని, నల్లగొంద బిట్టడివిలాగ కనబడుతున్న, మన బలగం సూస్తే యెలాటివాడికయినా ముక్కుమీద గుద్దినట్టుంటావి. ఇలాంటి సభకు నన్ను పెద్ద సెయ్యడం నాకు చాలా గౌరవం.

అడుక్కుతినోళ్ళకి గౌరవ మేమిటని అంటారు కొందరు; అజ్ఞానం మూర్ఖులు. అడుక్కుతినోళ్ళంటే అంత అల్పంగా పోయేవారు కారు. దేశంలో నూటికి ఇరవైమంది, నిజంగా అడుక్కుతినోళ్ళే. అయితేనేం? అభిమానం కొద్దీ కొంతమంది ఆ మాట వొప్పుకోరు. మనసభలు సూసి ఆళ్లుగూడా మనలో సేర్తారనే నా నమ్మకం. ఇప్పటి కాళ్ళ నొది లేసినా, నూటికి పదికి తక్కువుండరు. అది శిరాచ్చరం, అంటే దేశంలో సుమారు నాలుగుకోట్లు అడుక్కుతినోళ్ళ మున్నామన్న మాట. ఇంతమంది అడుక్కుతినోళ్ళు ఈ హోల్ ప్రపంచంలో మరే దేశంలోనూ లేరని మన ఇండియాకి పెద్ద పేరూ, ప్రత్యేక కీర్తీ ఉన్నాది. ఆ పేరూ ఆ కీర్తీ అంతా మనవల్ల వచ్చిందే అన్న మాట ఎవ్వరూ మరచిపోకూడదు.

చప్పట్లు—అవును—నిజం—బాగా చెప్పావు దమ్మన్నా—దమ్మన్నకీ జేయ్ !

ఇకను, మనవల్ల దేశానికి కలుగుతున్న లాభం ఏమిటని అడుగుతారు. వల్లమాలినంత ఉన్నాది. కార్ఖానాలలో యజమానులూ పనివాళ్ళూ, యెవసాయంలో రైతులూ కూలీలూ యెలాగ దేశానికి సేవ చేస్తున్నారో అలాగే మనమూ సేవ చేస్తున్నాము. ఆళ్ళు తిండీ గుడ్డా యిచ్చి ప్రజల

దేహాలకు మేలు సేస్తున్నారు. మనమేమీ తీసిపోలేదు. అన్నమో రామచంద్రా అంటూ, అలో నారాయణా అంటూ, మాదవకబళం అంటూ, ధర్మం సెయ్యండి అమ్మా నాయనా అంటూ, దినదినమూ యెచ్చరిస్తూ ప్రజల ఆత్మలకు ఉపకారం సేస్తున్నాము. మనమిలాగ దయిబాన్నీ ధర్మాన్నీ గేపకం తీసుకురాకుండా ఉంటే, ఈ రోజుల్లో ఆ భగవంతుడిని తలిసే వోడుంటాడా? మనం సేస్తున్న ఈ ఉపకారాన్ని గూడా ఎవ్వరూ మరచి పోకూడదు.

బలే దమ్మన్నా....దమ్మన్నకీ జేయ్. ..
చప్పట్లు.. .ఆలిండియాకీ జేయ్....
అడుక్కు తినోళ్ళకీ జేయ్ !

ప్రజల శరీరాలకీ, ఆస్తులకీ, ఇబ్బంది రాకుండా సూస్తూంటాది దొరతనం. అలాగే మనం యెల్లప్పుడూ రామనామ తారక మంత్రం యినిపిస్తూ, ప్రజల ఆత్మలకు ఇబ్బంది రాకుండా సూస్తున్నాం. ఆ పని సేసినందుకు దొరతనానికి పన్నులుకట్టి పోషిస్తారు ప్రజలు. అలాగే, ఈ ఉపకారం సేసినిందుకు ప్రజలు మన అడుక్కు తినోళ్ళని దానధర్మాలతో పోషించాలి. ఇది దయా దాచ్చిన్యం కాదు; సేయవలసిన యిధి, యిధి! బెమ్మదేముడు చెప్పిన ధర్మం.

దయా దాచ్చిన్యం కాదనడానికి అట్టే వాద నక్కరలేదు. మన నాలుగుకోట్ల అడుక్కుతిన్న వోళ్ళందరికీ తలా ప ట్టెడన్నం పెడితే తక్కినోళ్ళ భోజనాలూ యిందులూ తక్కువవుతా యంటారా లేదా? మనం పస్తులుంటున్నాం కాబట్టి ఆళ్ళు మస్తుగా తింటున్నారు. అలాగే మన బలగం బతకడానికి వసతులు—గుడిసెలే అనుకోండి—ఇవ్వాల తప్పదంటే, ఈ గొప్ప గొప్ప మేడలూ, ఆవరణలూ సప్పనవుతాయంటారా లేదా— మనం దారిపక్కలా, సెట్లకిందా జీవిస్తున్నాం కాబట్టే, ఆళ్ళు మేడలూ మిద్దెలూ ఎక్కుతున్నారు. మనం ఇంతమందిమి త్యాగం సేస్తున్నాం కాబట్టే, ఆళ్లు అంత భోగం అనుభవిస్తున్నారు. అందుసేతనే అడుక్కుతినోళ్ళ

కివ్వడం దయ అనుకనోళ్ళను అంతా వొట్టి తెలివితేని మొద్దులు.దద్దమ్మలు. అడుక్కుతినోళ్ళని 'అవతలికి పో' అని అనోళ్ళంతా దేశానికి, దేముడికి ద్రోహం చేసినోళ్ళే అవుతారు.

మన బలగం చిన్నదీ చితికెదీ కాదు నాలుగుకోట్లు జనాభా ఉన్న బలగం వృత్తిలోనూ, బతుకులలోనూ, కష్టసుఖాలలోనూ, దావలోనూ, యేసంలోనూ, అన్నిటిలోనూ మనమంతా ఒక్కటి — ఏ దేశంలోని కెళ్ళినా మన బలగం ప్రత్యేకమే; రూదే। ఇంత రూడైన బలగం ఇంత జనాభా ఉన్న బలగం ఇంకొక్కటి దేశంలో లేదు. మన బలగం అంతా ఒక్కసారి గట్టిగా 'ఫూ' అని వూదితే, తక్కినోళ్ళ బలగాలు యెగిరిపోతాయి.

చెప్పట్లు .అవున్రా నాయనా...
అడుక్కుతినోళ్ళు జిందాబాద్...
ఆలిండియాకీ జేయ్ ...

రోజులు మారిపోయాయి. పరాయి దొరతనం పోయింది. సొతంత్రం తెచ్చియిచ్చాడు గాంధీమహాత్ముడు. ప్రజల చేతులలో అధికారం పెట్టాడు. ఎందుకు పెట్టాడు? మేడలమీద మేడలు కట్టమనా? లక్షలూ కోట్లూ ఇనప పెట్టెలలో బర్తీ చెయ్యమనా? కాదు; ముమ్మాటికీ కాదు. జనమంతా సుఖంగా బతకాల; కూటికీ, గుడ్డకీ, గుడిసెకీ కరువైన పిట్టగూడా దేశంలో ఉండకూడ దన్నాడు.

ఏదీ? ఒక పుష్కరం (12 సంవత్సరాలు) అయింది. ఆరు నెలల కొకసారో యేడాదికొకసారో అధికారులొచ్చి ఈ బిచ్చగాళ్ళ కేదో ఎర్పాటు చెయ్యాలని బొల్లి బొల్లి యిచారం కనబరుస్తుంటారు. అంతే। ఎక్కడి గొంగడి అక్కడే ఉంటాది. గాంధీమహాత్ముడు చెప్పిందంతా చేసిందంతా, ఈ పెద్దల మూలాన గంగలో కలిసిపోయింది. ఇంతకంటే పాపం యేరే ఉంటాదా?

ఈ బొల్లి యిచారాలు పనికిరావని మన అధికారులకి చెప్పాలి. మాలో కాలూ చెయ్యీ దాగున్న వాళ్ళకి కార్ఖానాలలో పనులు కలి

పించండి. పనులు చేయించుకొని పట్టెడన్నం పెట్టేలాగ చెయ్యండి. ఏలాటి పనీ చెయ్యలేని కుష్టోళ్ళనీ రోగిస్టులనీ సత్రాలలో పెట్టి సాకండి. ఇది ముందుచేసి, తరవాత మీ పనులు చేసుకోండి. అంతేగాని కుష్టోళ్ళనీ రోగిస్టులనీ అడుక్కుతినే వోళ్ళనీ యీదులంట తిరగనీయకండి. అది ఆళ్ళ దర్కిదమనిపించుకోదు; దేశ దరిద్రమే అని ఈ మహాసభ నుంచి. గొంతెత్తి చెయ్యిసాచి ప్రపంచానికంతటికీ యినిపిస్తున్నాను. లేకపోతే ఊరు కోము.

"దమ్మన్నకీ జిందాబాద్!"

"అడుక్కుతినోళ్ళకీ జేయ్!"

సభలో అనేకులు ఉత్సాహంతో, కూర్చోలేక, నిలబడిపోయారు. సూరన్న లేచి, చేయెత్తాడు. మళ్ళా నిశ్శబ్దం.

"దమ్మన్నా! అలా మనల్ని సాకడానికి ఈ దొరతనానికి పేత గాకపోతే, మున్సిపాల్టీ వోళ్ళు దిక్కులేని కుక్కలని ఎక్కడికో తీసికెళ్ళి 'గాసు' పెట్టి సంపుతుంటారే! అట్టాగా ఈళ్ళనిగూడా సంపేమందామా?" అన్నాడు సూరన్న.

"బాగన్నావు—సూరన్నకీ జేయ్."

దమ్మడు శాంతించు శాంతించు అన్నట్లు చెయ్యూపాడు.

పోలయ్యన్నవాడు లేచి. "అయితే దమ్మన్నా, మనల్ని అడుక్కుతినోళ్ళ నడం నాయమా అంటాను? అడుక్కోడం మాట నిజమేగాని. తినడం ఏమైనా ఉందా? తినోళ్ళెవ్వరున్నారీ మహాసభలో?"

"అవును, అవును"—చప్పట్లు. "పోలయ్యకీ జేయ్—"

"అడుక్కోడమే మనొంతు—తినడానికి నోచుకోలేదు. ఏమైనా తిన్నామంటే—తిట్లూ దెబ్బలూ తప్ప మరేమీ లేదుగదా! అలాంటప్పుడు మన పేరు అడుక్కుతినే వోళ్ళనడంకంటే అడుక్కునేవోళ్ళని సవరించు కోవాలంటాను. అడుక్కుని తిన్నవోళ్ళున్నారు. కాని ఆళ్ళు మన బలగంలోకి రారు. ఆళ్ళేరు మన మేరు. ఇంకా సెప్పాలంటే ఆళ్ళే మన కిరోదులు—

ఆళ్ళే మన నోట్లో మన్ను కొడుతుంటారు. కాబట్టి పేరు మార్చుకుందాం" అన్నాడు.

చప్పట్లు—"పోలయ్య జిందాబాద్—దమ్మన్నకీ జేయ్—"
"అడుక్కునోళ్ళకీ జేయ్—"

దమ్మడు "సద్దు సద్దు." అని చెయ్యెత్తాడు "మరొక్క ముక్క మయిన మాట. అడుక్కోడం ఏమిటో, యెందుకొచ్చిందో, దాని ఆంతర్య మేమిటో, అంతా యివరంగా, చిన్నపిల్లలకి కూడా తెలిసేలాగా రాసి, ఈ మహాసభకి పంపించారు. ఎవరో కాదు; మీరందరూ ఎరిగిన 'అడగజాల నయ్యగారు'. అది నాకూ మీకూ పాత్రమే కాదు; హోల్ దేశం మొత్తం మీదున్న పెజలందరికీ తెలియాలని అచ్చెయ్యించి మరీ పంపించారు. సూరన్న మీ కవి పంచిపెడతాడు. సోములు చదువుతాడు. శర్దగా యినండి."
అన్నాడు. సూరన్న కాగితాలు పంచిపెట్టాడు; మహాసభ సమాప్తమయింది.
"జేయ్, అడుక్కుతినోళ్ళ మహాసభకీ జేయ్." "దమ్మన్న జిందాబాద్."



# ఇవ్వడమేం కష్టమయింతే
# అడగడం అంతకన్నా కష్టం !

'అడిగాడు' అనగానే అల్పుడయి పోతాడు—ఎవడయినా సరే అంతకుముందు అందలం మీద కూర్చోపెట్టినా, ఆ వేళనుంచి, వాడిని అడుగున పడేస్తాం. వాడి గుణాలు అంతర్ధానమయిపోతాయి; వాడి గౌరవం సున్నా అయిపోతుంది. అడిగినందుకు ప్రతిఫలం కలిగినా కలగకపోయినా ఈ అనాదరణ మాత్రం తప్పదు. అంతకుముందు ప్రాణ స్నేహితుడయినా, పెడమొగం పెట్టక మానడు.

అడిగాడు—అంటే అడుక్కున్నాడు—అంటే ముష్టివాడు కాక మరేమిటి? ఇంకా స్నేహమూ, మర్యాదా? ఎందుకుండాలి? "ముష్టివాడికి గౌరవం చూపుతామా?" అని అనిపిస్తుంది. అది మన లోపమో, కాక వాడి పాపమో తెలియదు.

యుగయుగాలనుంచి ఉన్న సూత్రం ఇది. అడిగినవాడు అల్పుడు, ఇచ్చినవాడు హెచ్చు. ఇచ్చిన వాడిని దాత అన్నాము, ఉదారుడన్నాము, వదాన్యుడన్నాము . ......అన్నాము. ఇవ్వడం అంటే ఈవి అన్నాము, త్యాగం అన్నాము, పొగిడాము—పొగుడుతూ ఉన్నాము కూడాను. ఎలాగ మానగలం? 'గతానుగతికులు లోకులు' అన్నారు వారిని చూచి వీరు, వీరిని చూచి మరికొందరు. అంతే! ఏమిటి? ఎందుకు? అని ఆలోచించిన వారెందరున్నారు మనలో? ఎవడికి కావాలి ఈ పరిశోధనా, ఈ బెడదాను? అంచేతనే మనసుకూడా ఈ నాగరిక ప్రపంచంలో గూడా ఇచ్చేవాడిని మెచ్చుకుంటాం; దీనికి ప్రతిబింబంగా అడిగేవాడిని అడుగున పడవేస్తాం.

కాని ఎవ్వడయినా ఆలోచించడానికి ప్రయత్నించాడా, చచ్చాడు. ఎందుచేత నంటారా? ఇవ్వడమే కష్టమయితే, అడగడం అంతకన్నా ఎక్కువ కష్టమవుతుంది. ఉన్నదాని నివ్వడమే గొప్ప అంటే, లేదని అడగడం అంతకన్న గొప్పపని అని తేల్తుంది ఇచ్చేవాడి త్యాగం కొండంత అయితే, అడిగేవాడి త్యాగం బ్రహ్మాండమంత అని తేటపడుతుంది. ఆశ్చర్యంగా ఉంటాయి ఈ మాటలు. అడుక్కున్న వాడిలో త్యాగం ఏమిటి? అని శంకిస్తుంది హృదయం. కొంచెం అసత్యంగా ఉన్నట్టుకూడా కనబడుతుంది. నిజమే. కాని, అడిగేవాడంటే ఎవడు?

అడగడమే ఆచారంగాను, అదే ఒక వృత్తిగాను, చేసుకొని యాయవారానికి వచ్చిన పెద్దలు ఈ అడిగే వాళ్ళలో జమ కారు వీళ్ళు అడుక్కోడాన్ని ఒక విద్యగా, ఒక కళగా చేశారు. దానికోసం యేళ్ళతరబడి కృషి చేశారు. కాలేజీలు యూనివర్శిటీలు, లేవుగాని, వున్నట్టయితే, ఈ కళలో వీరంతా డిగ్రీలు పుచ్చుకొని పట్టభద్రులయి వుందురు. డాక్టర్లు, లాయర్లు అడిగింది అడుక్కోవడమంటామా? అనము. అలాగే ఈ వృత్తి పెద్దలు అడుక్కున్నారని చెప్పం. పైగా, డిమాండుచేసి ముక్కు నులిపి పుచ్చుకోవడానికికూడా వీరికి హక్కుంది అనుకోవచ్చును. డాక్టరు బిల్లు పంపినప్పుడు లాగానే, "సువర్ణ పుష్పం సమర్పయామి" అన్నప్పుడు గూడా—చెల్లించక తప్పదు అన్నభావమే కలుగుతుంది. అంతేగాని, ఇప్పుడు 'చెయ్యి వల్లకాదు పో' అనడానికి నోరువస్తుందా? వీరంతా అడగడానికే పుట్టారు. అడగక మానరు. ఇస్తూవున్నంతకాలం పుచ్చుకుంటూ వుండక తప్పరు, ఈ మహానుభావులు. వీరిని గురించి వ్యాఖ్యానాలు చేసే ద్రోహి వుంటాడా? వుంటే, వాడిని రౌరవనరకానికి పంపించడం మానతారా? సూత్రాలు వారివి, ధర్మశాస్త్రాలు వారి చేతుల్లో వున్నాయి

వీరుకాదు. వృత్తిగా అడిగేవారి విషయంకాదు, విధిలేక అడిగేవారి సంగతే ఆలోచించాలి. కాలచక్ర పరిభ్రమణంలోపడి, కత్తెరబోనులాంటి అవస్థ వచ్చినప్పుడు, గత్యంతరంలేక, నోరు విడిచి ఒకరిని అడగవలసి వచ్చిన వాళ్ళ సంగతే పరిశీలించాలి. మర్యాదగా కాలం గడుపుతూవుండి,

"మాలవిధి" సమకూర్చిన మతిలేని సన్నివేశాలలో నలిగి. తప్పించుకోడానికి దారికనబడకుండా, సిగ్గువదలి చేయి చాచవలసిన వాళ్ళసంగతే పరిశోధించాలి. మానసం కలవాడు; మర్యాదగా బతికేవాడు; శక్తివంచన లేకుండా ప్రయత్నం చేస్తాడు; సాధ్యంకాదు. ఇతరుల సాయం అవశ్యకం అవుతుంది; అడగక తీరదు—అంటే ఆత్మహత్య అన్న ఒక్కదారి తప్ప—అలాంటప్పుడు అడుగుతారే, వాళ్ళ సంగతి యోచించాలి.

అబ్బా ! ఎంత కష్టం ! ఎంత దుర్భరం ! ఆలోచించిన కొద్దీ గుండెలు తరుక్కునిపోతాయే ! ఎవరిని అడగడం? ఏలా పోవడం ? ఎలా ఆరంభించడం? ఏమని అడగడం? అనుకున్న మాటలు అంతరిక్షానికి ఎగిరిపోతాయి. వల్లె వేసుకున్న పారాలు చెల్లాచెదురై పోతాయి ఇంత బాధపడి అడిగినప్పుడు, అవతలవాడు లేదంటాడేమో? అడిగినందుకు ఫలం—అడిగ్గాడు అని అనిపించుకున్న ఫలం తప్ప ఇతర ఫలం— దక్కదేమో, అబ్బా ? కళ్ళు తిరుగుతాయి. ఒళ్ళంతా తేళ్ళు, పాములూ పాకుతాయి. తలకాయలో ఎవడో చెయ్యిపెట్టి కలుపుతూ వుంటాడు. ఆ చేతిలో ముళ్ళు. మేకులో ఏవో గూడా వున్నట్టుంటుంది. గుండెల్లో శూలాలు గుచ్చుకుంటూ వుంటాయి ఏమిబాధ! ఎంత యాతన? ఇంకా, ఒకరి దగ్గరకు వెళ్ళలేదు. అడగనయినాలేదు! ఈ యాతన అంతా పూర్వ రంగమే.

ఈ యాతన అంతా గ్రహించే మహానుభావుడు కాళిదాసు,

అభ్యర్థనాభంగ భయేవ సాధుః
మాధ్యస్థ మిష్టే ప్యవలంబ్య తేర్థే

అన్నాడు. అడిగితే లేదని జవాబు వస్తుందేమో అన్న భయంచేత కావలసిన వస్తువుగూడా అక్కరలేదన్నట్లే ఊరుకుంటాడట? వస్తువు లేకపోయినందు వల్ల పడవలసిన మహాబాధ అంతా పడనయినా పడతాడు; కాని, వాంఛను ప్రకటించి, అడిగి లేదనిపించుకునే బాధమాత్రం పడలేడట.

ఇంత అవస్థా పడతాడు. మానసాన్ని త్యాగం చేస్తాడు. ఆత్మ గౌరవాన్ని ధారపోస్తాడు. శరీరాన్ని, ఆత్మను చంపుకుంటాడు. తన గుణా లను తగులబెట్టుకుంటాడు. తన అధికార్యాన్ని తన్ని అవతలకి గెంటి వేస్తాడు తనకున్న సర్వస్వాన్ని తానే విసర్జిస్తాడు. అడగబోతాడు. ఇదేనా తక్కువ త్యాగం? ఇదేనా అల్పకార్యం? ఈ యాతనలో, ఈ బాధలో; ఈ త్యాగంలో ఒక లక్షోవంతు ఒక కోటో వంతు ఉంటుందా త్యాగి చూపేది? ఇంతకూ త్యాగి, దాత, ఈ ఉదారుడు చేసిందేమిటి?సాధారణంగా తనకున్న దానిలో కొంత ఇస్తాడు. అది పోయినందువల్ల తానేమీ బాధ పడడు. తన పుట్టి మునిగేది లేదు. కాని, అడిగేవాడో? అలాకాదే.తనకున్న సర్వస్వం విడిచిపెట్టుకొని అడుగుతాడు. మొదట ఎంతో బాధపడతాడు ;

ఇంత బాధపడి అడగటానికి నిశ్చయించుకుంటాడు. అడగబోతాడు! ఇంక అతని యాతన చూడవలసిందే; చెప్పడానికి వీలులేదు. కవులుకాము. సాక్షాత్తు ఆ సరస్వతి వచ్చినా ఆ బాధ వర్ణించడం కష్టం——

నడువగ త్రొట్రుపా టొదవు,
నాలుక యాడదు, మాటలాడగా
దొడగిన ఈ రెలుంగువడు,
తొల్లిటిపొంకము డొంకిదేహమున్
వడకు భయంబు గ్రమ్ము, దుర
వస్థల తల్లడ మందు ..... .....

అన్నాడు ఒకడు —— సాహసించి. అంతవరకయినా వ్రాయగలిగాడు: ధన్యుడే. కాని, ఇది ఏపాటిది? ఆ దురవస్థలో ఎన్నోవంతు ?

ఇంత యాతనను అనుభవించి అడుగుతాడు——అడుగుతాడనిగూడా చెవ్పలేము. అడగడానికి ప్రయత్నం చేస్తాడు. అర్థించడానికి సాహసిస్తాడు. ఎందుచేతనంటారా?అడిగితే ఏమంటారో అన్నభయం ఎప్పుడూ బాధిస్తూనే వుంటుంది. అది త్రిశూలయాతన. ఆ యాతనలో 'అడగడం' అన్న పని సాంతంగా జరుగుతుందా? జరగదు. జరగలేదు. కంఠస్వరంలో గాద్గదికం

కలుగుతుంది.లోగొంతు పడుతుంది. మాటలు లోపలనుంచి బయటకి రావు. బలవంతంగా బయటికి పంపాలి ఆ మాటలను;ఈడవాలి; ఈ సంఘర్షణలో మాటలు తెగిపోతాయి. ఉండి ఉండి ఒకమాట బయటికి వస్తుంది. ఆమాట అయినా, పాపం! పూర్తిగా వినబడుతుందా? లేదు. అన్ని అక్షరాలు స్వచ్ఛంగా ఉచ్ఛరించడానికి దమ్ముచాలదు. కొన్ని అక్షరాలు లోపించి పోతాయి. వినబడవు "రూపాయి" అని అనబోతాడు. 'రూ' అన్న అక్షరం ఒక్కటే వినబడుతుంది. తరువాత, పెదవులుమాత్రం కదులుతాయి; ధ్వని వినరాదు. ఊహించుకోవల్సిందే హృదయం వున్నవాళ్ళు గ్రహించు కోవలసిందే. ఇంతబాధపడి అడుగుతాడు, 'దేహి' అని.

ఈ మహా యాతనను గ్రహించిన ఒక్క మహానుభావుడు,
'యాచ్ఞాభంగభయేన (1) గద్గదగళ (2) త్రుట్యత్ (3)విలీనాక్షరం"

అని యాచనలో ఉన్న త్రిశూలయాతనను సూచించాడు. అడగడంలో ఉన్న అవస్థ నంతటినీ అచ్చున గుద్ది చూపించాడు. అడుగటానికి తెర వెనుక వున్న యమయాతన అంతా నాలుగు మాటలలో ప్రదర్శించాడు ఎవడో ఒక అభాగ్యుడు అడిగినప్పుడు, నిజమయిన దాత గ్రహించవలసిన విషయం అంతా అలా విప్పి చెప్పాడు. ధన్యుడు భర్తృహరి.

# వసిష్టివాడిని సృష్టి చేసిన భూలోక బ్రహ్మలం

అడిగేవాడు చూపించిన త్యాగం అంత అపారం; అడిగినప్పుడు మానిసి పడ్డ యాతన అంత విశేషం; అడగడంలో ఉన్న కష్టం అంత మహాధికం. ఆ అవస్థ దుర్భరం. ఆ స్థితి సంఘంలో ఉండడం ఒక మహా అవమానం. మనుషులకందరికీ లజ్జాకారణం.

ఏమంటారా ? మానవు లంతా ఒక కుటుంబం అంటారు కదా ! "అంతా" అన్నది అతిశయోక్తి అనుకున్నా ఒక్క జాతివారయినా, ఒక్క సంఘం వారయినా ఒక కుటుంబం అన్నంత వరకయినా అంగీకరించాలి కదా? అటువంటి సంఘకుటుంబంలో ఒకడు అడుక్కోవలసిన అవసరం ఎందుకు వచ్చింది? ఎలా వచ్చింది? ఎందుకు రావాలి? ఈ నీచత్వం ఎవరిది? ఆ అడుక్కున్న వాడిదా? కాక కుటుంబం అంటారే ఆ సంఘానిదా? 'వాడిలో ఏదో లోపం ఉంది; వాడెందుకూ పనికిరాకపోతే ఏం చెయ్యడం?' అని ప్రశ్నకు ప్రశ్న బదులు అడుగుతారా? సమర్థులు ఏమిచేసినా చేయ గలరు.

కాని, ఒక కుటుంబంలో, ఒక యింటిలో ఉన్నవారంతా చేతనయిన వాళ్ళేనా? అందరూ ప్రయోజకులేనా? అందరూ అర్జించే వాళ్ళేనా? అలా ఉండరే. చేతగాని వాళ్ళు, అప్రయోజకులూ కొందరుంటారుకదా ? వారికెందుకు అడుక్కోమని పంపలేదు? వారికీ తక్కిన వారిలాగా కూడూ గుడ్డా ఎందుకిస్తారు? లేదే అన్న కొరత వారికి లేకుండా చేస్తారెందుకు?

కాదు. ఆ యింటిలోనే ఒక చొట్టవాడో, గుడ్డివాడో పుట్టాడనుకోండి. వాడిని ఏంచేస్తాం? మనం తిన్న అన్నమూ కూరా పెట్టమా? మనం తొడిగే గుడ్డ కట్టుకోనివ్వమా? మన సౌఖ్యం లాగ వాడి సౌఖ్యంగూడా కాపాడుతామే. మన కున్నదానిలో వాడినీ ఒక భాగహారిలాగా చూస్తామే. వాడి ఆహారం కోసంగూడా మనమే కష్టపడతామే. వాడి గుడ్డకోసం గూడా మనం శ్రమ తీసుకుంటామే. వాడిని పోషించడం మన ధర్మం అంటామే.

ఆ ధర్మం సంఘంలో ఏమయింది? ఇదీ ఒక కుటుంబమే కదా! ఇందులో ఒకడిని అడుక్కోనివ్వడం సిగ్గుకాదా? లజ్జ కాదా? ఆ సంఘాని కంతటికీ అది తీరరాని కళంకం కాదా? ఇకను అలా అడుక్కునే వాడిని "ఛీ! పో!" అని కసరిన వాడిని ఏమనడం? ఇది అలా ఉంచండి. ఈ కుటుంబంలోనుంచి ఒకడు అడుక్కున్నాడంటే, ఇది ఎవరు చేసిన పని? వాడు తన స్వేచ్ఛతో అడుక్కోడానికి వెళ్ళాడని అంటామా? అనగలమా? అడుక్కొనేటట్టు తక్కినవారు చేశారన్న మాటే కదా! అంటే, కూటికీ, గుడ్డకీ వాడికి కరువు కలిగించారన్న మాట. సంఘం వారి పోషణ విషయం మరచిపోయిం దన్నమాట. అంటే, తన ధర్మం తాను నిర్వహించ లేదన్నమాట. అంటే, వాడి అడుక్కోడం, వాడి అప్రయోజకత కాదు. సంఘం అప్రయోజకత, సంఘం అధర్మం.

అందుచేతనే, ఇప్పుడుగూడా ముష్టివాళ్ళు "ధర్మం చెయ్యండి బాబూ" అంటారు. 'డబ్బియ్యండి బాబూ' అనరు; బువ్వ పెట్టు బాబూ అనరు, ధర్మం చెయ్యమంటారు. దాని అర్థం మనం గ్రహించము; గ్రహించలేము. వాళ్ళేదో అడుక్కుంటున్నారని భావిస్తాం. నిజం అదికాదు. వాళ్ళు సంఘాన్ని హెచ్చరిస్తున్నారు. మరపునబడ్డ విషయాన్ని జ్ఞప్తికి తెస్తున్నారు. మన అధర్మాన్ని ఎత్తి చూపి, చెంపపెట్టు పెడుతున్నారు. కొరడా పట్టి కొడుతున్నారు. కాగడా పట్టి చూపుతున్నారు. "ఓరి దౌర్భాగ్యుల్లారా! ధర్మం చర అని వేదాలు ఘోషిస్తూ ఉన్నప్పటికీ, మీరు మీ ధర్మాన్ని పరిత్యజించారు. ఇప్పుడయినా గ్రహించండి; మీరు చేయవలసిన ధర్మం మీరు నిర్వర్తించండి" అని ఒక మహోపన్యాసం చేస్తున్నారు.

ఇంత అర్థం అందులో ఉన్నదని గ్రహించలేము ధర్మం చెయ్యండంటే పిడికెడు బియ్యం వెయ్యండని అర్థం చేసుకుంటాం. చూచారా! అధర్మం ఎంతుందో, మనలో అజ్ఞానమూ అంతవుంది. చేసిన అన్యాయం చెప్పినా గ్రహించలేకుండా వున్నాము.

ఆ ముష్టివాడు చెప్పినమాట నిజం. చేతకాని వారిని పోషించవలసిన ధర్మం సంఘానిది. ఎవడి నయినా అడుక్కోకుండా కాపాడవలసిన బాధ్యత సంఘానిది. కాబట్టే వాడు ధర్మం చెయ్యమంటాడు. ఇంతకుపూర్వం అలాగే చేస్తూ వుండేవారు. అడుక్కోవలసిన అవసరం లేకుండా చేసేవారు. శక్తిలేని వారిని సంరక్షించే పద్ధతి వుండేది ఎవడి శక్తినిపట్టి వాడు ఆర్జించుకొనేవాడు. హెచ్చు ఆర్జించేవాడూ వుండేవాడు, తక్కువ ఆర్జించేవాడూ వుండేవాడు. పైవాడి దగ్గర కొంత నిలవ వుండేది, రెండోవాడి దగ్గర అది లేకుండేది. అలా నిలవ ఉండడం మంచిది కాదని ఆ రోజుల్లో ఒక పద్ధతి చేసుకునేవారు. ఒక ధర్మం పాటించేవారు. సంవత్సరానికి ఒకసారి, నిలవ వున్నవారు తన ఆర్జన తక్కువవారి కందరికీ పంచిపెట్టేవారు. ఏ పండుగో, ఏ పబ్బమో సాకు చేసుకొని, నిల్వ ఆర్జనంతా తక్కువ వారికి ఇచ్చేవారు. అలా చెయ్యకపోతే పెద్ద పాపం అని భావించేవారు వున్నవాడికి అక్కరలేనిది కావలసిన వాడికి చేరేది.

ఈ పద్ధతి ధర్మభూమి అనుకుంటున్న మన భారత దేశంలోనేకాదు. అన్ని దేశాలలోనూ, ప్రపంచం అంతటా వుండేది పూర్వం. ఉత్తర సముద్రంలో మంచుగడ్డల మధ్య మంచుగడ్డలలాగ బ్రతుకుతూ వుండే ఐస్‌లాండు ప్రజలలో పూర్వం ఈ ధర్మం వుండేది. పుర్రెతోలు ఊడబెరికే క్రూరకర్ములలాగ కనబడే వెస్టు ఇండియనులలో (అమెరికా) ఈ పంచి పెట్టడం పూర్వంనుంచీ వచ్చిన ఆచారం. ఎండలో మలమల మాడి మసి బొగ్గులలాగా తయారయిన ఆఫ్రికనులలోనూ ఈ సూత్రం వుండేది. సంవత్సరానికి ఒకసారి తమ దగ్గరవున్న ఆస్తిని ప్రజలందరికీ పంచిపెట్టే వారు. సీల్ తోళ్ళయినా సరే, తిమింగలం ఎముకలయినా సరే, రాతితో చేసిన కత్తూలూ, కటార్లూ అయినా సరే, ఏదయినా సరే అందరికీ పంచిపెట్టేవారు.

మళ్ళీ శక్తి వంచన లేకుండా అర్జనకు ఆరంభించేవారు. పదిసార్లు పంచి పెట్టాసంటే, ఇరవైసార్లు పంచిపెట్టాను అని ఒకరి నొకరు మించిపోవ డానికి చూచేవారు. ఉన్నవాడికి ఈ కీర్తి దొరికేది. లేనివాడికి కొంత ఆదరం దక్కేది. అడుక్కొనే వాడు లేకపోయేవాడు.

అలాంటి ధర్మ ప్రపంచంలోనికి, అడుక్కునే వాడెలా ప్రవే శించాడు? ఈ అధర్మం ఎలా తల చూపింది? ఉన్నవారు త్యాగం మానారా? తమ దగ్గరవున్న నిల్వను పంచిపెట్టడానికి అంగీకరించ లేదా? అంతా తామే తినాలని తలచారా? లేదూ, లేదూ, లేదు. ఉన్నవారు ఇస్తూనే వుండేవారు కాని ఆ ఇచ్చేది కావలసిన వాడిదగ్గరకు వచ్చేదికాదు. మధ్యను కొంతమంది అపహరించేవారు. అవసరంవున్న వాడికి అందిచ్చేవారు కారు. తోవలోనే గుటకాయ స్వాహా అనేవారు. అవసరానికి అందకపోవడంచేత అడుక్కోడమే ఆధారమైంది. కాబట్టి, సుభిక్షంగా ఉన్న ఈ ప్రపంచంలో అడుక్కునే వాడిని సృష్టిచేసింది ఆ బ్రహ్మదేవుడు కాదు; ఈ మధ్యవర్తి; ఈ తోవకాసేవాడు, ఈ గుటకాయ స్వాహాగాడు, ఈ భూలోక బ్రహ్మ.

ఇతడేమి చేశాడంటారు? ఉన్నవాడి దగ్గరకు వెళ్ళి "అయ్యా, ప్రజలందరికి ఇస్తే ఎంతో నాకిచ్చినా అంతే. అది అంతా దేవుడికి స్వయంగా చేరుతుంది. నేను పుచ్చుకున్నప్పుడు కృష్ణార్పణ మంటాను. దానితో మీరు ఇచ్చినది డైరెక్టుగా దేవుడికే—ఒక బంగీలాగా, ఒక పార్సిల్‌లాగా— అందుతుంది" అని, అన్నాడు ఈ భూలోక బ్రహ్మ. ప్రజలకో బెడద తప్పిపోతుందన్నాడు కావలసిన పని సూక్ష్మంగా జరిగిపోతుందన్నాడు. మేము భూలోక బ్రహ్మలం అన్నాడు. దేవుడు మేము చెప్పినట్టంతా చేస్తాడన్నాడు. మేమే పూజారుల మన్నాడు. ప్రీస్టుల మన్నాడు. శ్లోకాలు పఠించాడు. మేమే నీకు దేవతల మన్నాడు. ఇచ్చేవాడికి నచ్చచెప్పారు. తల ఆడించమన్నారు

పాపం యుక్తికి ప్రతియుక్తిని చెప్పలేక, ఈ వున్నవాడు తత్తర పోయాడు. మనసొప్పలేదు. ఏదో అన్యాయం జరుగుతూ వుందని తెలుసు కున్నాడు: ఏమిటో చెప్పలేకపోయాడు. "ఏమండీ, భూలోక బ్రహ్మ,

లేని ప్రజలకుకదా ఇవ్వాలి? అదే కదా ధర్మం అన్నారు. మరి మీకివ్వమంటారే, ఇది ధర్మం అనిపించుకుంటుందా?" అని సంకోచంతో, భయపడుతూ భయపడుతూ అన్నాడు. భూలోక బ్రహ్మ చోల్తా పడతాడా? వెర్రిమాట. వేశాడు పద్మాసనం, ఉపదేశముద్రతో హస్తం పట్టాడు. అవును, ఇదే ధర్మం అన్నాడు. ఇది దానం అన్నాడు. ధర్మం అంటే దానం, దానంఅంటే ధర్మం అన్నాడు. అది భూదానం అన్నాడు ఇది గోదానం అన్నాడు; ఇది హిరణ్యదానం అన్నాడు. తోటకూర కాడకు శాకదానమన్నాడు. గుమ్మడికాయ కోసం కూష్మాండదానం అన్నాడు. ఇలా చేసినటయితే ఇది గోగర్భదానం అన్నాడు. అలా చేసినట్టయితే అది తులాభార దానం అన్నాడు ప్రజలను విడిచిపెట్టాడు. పేరుట పట్టుకొని బొమ్మలాడించాడు. తే తెమ్మన్నాడు.

దానందేహి ద్విజాతిభ్యో
వర్ణానాం బ్రాహ్మణో గురుః

మరికొన్నాళ్ళు పోయిన తరువాత అలా ఇవ్వకపోతే పాపం అన్నాడు. దానితో ఏమయింది? ఇచ్చేవాడు యిస్తూనే వున్నాడు. కాని కావలసినవాడికి ఒక్క కాసయినా దక్కకుండా పోయింది. మధ్యనే గుటకాయస్వాహా!

పోనీ ఎన్ని దానాలు తీసుకున్నా, సంవత్సరానికి ఒకసారి జరిగే ఆ పంచిపెట్టే పద్ధతయినా విడిచిపెట్టారా? లేదు. సర్వభక్షకం అగ్ని; వీరంతా నిత్యాగ్ని హోత్రులు; దేన్ని విడిచిపెడతారు? విడిచిపెట్టలేము; దీనికి "మహా మోక్షదానం" అని నామకరణం చేశారు ఈ పేరుతో. ఉన్నవాడి దగ్గిరి పస అంతా ఊడ్చుకుపోతూ ఉండేవారు. ప్రజలా? పళ్ళికిలించుకొంటూ ప్రేక్షకవర్గంలో చేరేవారు. వెయ్యి సంవత్సరాల క్రిందటిదాకా ఈ దానం భారత భూమిలో జరుగుతూనే వచ్చింది. హర్ష చక్రవర్తి క్రీ. శ. 646లో హ్యుయన్‌త్సాంగ్ ఇండియాకు వచ్చినప్పుడు ఈ మహామోక్షదానం చేశాడు. హర్ష చక్రవర్తి ఆ సిపాస్తులన్నీ అవతల బౌద్ధశ్రమణులు, ఇవతల హిందూ బ్రాహ్మణులు కాజేశారు ప్రజలు దేవురించారు; దేహీ అని బయలుదేరారు; అడుక్కున్నారు. కాబట్టే వీరంతా భూలోక బ్రహ్మసృష్టి అని అంగీకరించాలి. సంఘధర్మం గంగలో కలిసింది.

# మానసం గలవాడు అడిగాడంటే

ధర్మానికి దానం అన్న పేరు పెట్టాడు; దరిద్ర కళలన్నీ దేశానికి దాపురించాయి. సోదర మానవుడిని ఆకలి మంటలకు అప్పగించకుండా చూడ్డం ధర్మం. ఎవడికో "ప్రీత్యర్థం సమర్పయామి" అనిచెప్పుతూ మతం పేరిట మాయగాళ్ళకు యివ్వడం దానం మనుష్యులకు వెళ్ళవలసిన రథాన్ని మతానికి ఎప్పుడు తిప్పారో, అప్పుడే దరిద్ర లక్షణాలు దేశానికి దాపురించాయి. పరోపకారం కోసం ఉన్న ఆచారాన్ని ఏ నలుగురో అంతా మాకే అని స్వాహా చెప్పవచ్చారో, ఆనాడే "అన్నమో రామచంద్రా" అన్న ఆక్రోశానికి ఆలవాలం ఏర్పడ్డది. మతం పేరుతో వ్యవహరించలేని వాడికి మార్గాంతరం లేకపోయింది. ఎంత పండితుడయినాసరే, ఎంత నిపుణుడయినా సరే, అడుక్కోక తప్పింది కాదు. కుంటి వాడయినాసరే, కుష్ఠు రోగయినా సరే మహా ఆయాసంతో అలా వీధులలో కాళ్ళీడ్చుకుంటూ కనబడవలసిందే. పుట్టుగుడ్డి ఐనాసరే కాళ్ళూ చేతులూ లేని "కబోది" అయినాసరే అలా నడివీధులలో అఘోరిస్తూ ఉండవలసిందే. బ్రాహ్మణార్థాలు జరుగుతూనే ఉంటాయి. సంతర్పణలు సాగుతూనే ఉంటాయి. అక్షయపాత్రలు అలా నిండుతూనే ఉంటాయి. అగ్రహారాలు చేతులు మారుతూనేఉంటాయి. కాని, ఈ దిక్కుమాలిన మొర్రలకు మోక్షం ఉండదు.

ధర్మాన్ని దానం చేసినందువల్ల ఇంత దారుణం జరిగింది. మహామహులకు కూడ ఈ ఆపద తప్పలేదు. కవులు యాచించవలసి వచ్చింది. పండితులు ప్రార్థించవలసి వచ్చింది. మహా విద్వాంసులు భిక్షాటనం చేయవలసి వచ్చింది. చూస్తూ చూస్తూ ప్రజలు — ఇవ్వగలవారు —

ఊరుకున్నారు. ఈ పేరున ఆ పేరున వారు ఏవేవో దానాలు చేశారు; పుణ్యం వచ్చినట్టే కదా ! - ఇంకా ఎందుకు ధనవ్యయం చెయ్యాలి ?' అన్నట్టు ఒక ఊహ కలుగుతుంది. పిడికెడు బియ్యం ఇవ్వడానికి నిశ్చయించినా, ఎవరో బ్రాహ్మడో, జంగందేవరో, కనబడాలి; వారికే ఇవ్వాలి. వికలాంగులను చూస్తూ ఊరుకుంటారు. వస్తు పడుతున్న మహా పండితుడిని చూడనియినా చూడరు.

ఈ సందర్భంలో ఒక్క విషయం జ్ఞాపకం తేవాలి. ఒక ధనికుడు బాగా దానాలు ఇస్తూ ఉంటాడు దగ్గర ఉన్న మనుషులు అతడిని శ్లాఘిస్తు న్నారు. "అహో ! వదాన్యశేఖర ! నీకు సాటి ఎవ్వరు ? శిబి, దధీచి, మాంధాత . .నీతో సరిరాగలరా ? నీ వితరణ మేఘంలాగా ధనాన్ని వర్షి స్తూంది" అని పొగుడుతున్నారు. ఆ పక్కనే ఉన్నాడు ఒక మహా విద్వాం సుడు. పొట్టనిండా విద్యలున్నా, పొట్టపోసుకోడానికి దారి లేదు. ఈ ధని కుడిని ఎన్ని దినాలు కనిపెట్టుకొని ఉన్నా ఒక దమ్మిడి అయినా దక్కలేదు. ఆ మహా పండితుడు విన్నాడు ఈ పొగడ్తను. మేఘం ధనాన్ని వర్షిస్తూ ఉందట ! నాలుగు దిక్కుల వాళ్ళూ లాభంపొందుతూ ఉన్నారట ! ఒళ్ళు మండింది. ఈ ధనికుడికి బుద్ధి చెప్పాలనుకున్నాడు కాబోలు ! గట్టిగా ముక్తకంఠంగా అందరూ విని అదరి పోయేటట్టు, సుశ్రావ్యమైన గంభీర స్వరంతో.

దరిద్రచ్ఛత్ర సంపన్నా
మయి నాయాంతి బిందవః.

అని అన్నాడు. అర్థమూ—విశేషం లేదు. "ఓ వదాన్యశేఖరా ! నిజమే. మీ దానాలు వర్షాల లాగా నాలుగు దేశాలవారికీ ఇంత తడిని కలుగ జేస్తున్నాయి. కాని,నాదగ్గర ఒక మంచి గొడుగుంది దానిపేరు దారిద్ర్యం'. ఆ దరిద్రచ్ఛత్రంతో ఉన్నాను కాబట్టి, ఆ వర్షంలో ఒక్క చినుకైనా, మహా ప్రభూ ! నా మీద పడడంలేదు" అన్నాడు. దీనినిబట్టి ఇచ్చేవాడు ఇస్తూనే ఉన్నాడనీ కావలసిన వాడికి ఒక్క కాసయినా దక్కదనీ రుజువు అవుతుంది కాదా ?

అందుచేతనే మహామహులు అడగక తప్పింది కాదు. మానసంకల మహానీయులచేతగూడా అడిగించుకున్నాము కదా అన్న పుణ్యం దాతలకు దక్కింది అంతే కాదు. అటువంటివారు అడిగినప్పుడు "లేదు పో" అన గలిగిన గౌరవంకూడా చిక్కింది; రేపు రా, మాపు రా అని తప్పించుకొనే అదృష్టంగూడా లభించింది డబ్బున్న వాడెంత ధన్యుడు! అన్ని పుణ్యాలు అనాయాసంగా లభించాయి. ఇదంతా ఆ దానాల ఫలితమో ఏమో, ఎవరు చెప్పగలరు ?

మానసంగల ఈ మానిసి అడుగుతాడు అంటే ఎంత యాతనపడ్డాడో తెలుసునుకదా. త్రిశూలయాతన అనుభవిస్తాడు. దాత ఎదుట అంత నికృష్ట మయిన ఆవేదనను పొందుతాడు ఆత్మనూ, దేహాన్నీ ఒక్కలాగానే చంపు కుంటాడు. "ఎందుకు ? ఎందుకీ యాతన పడతాడు ? ఎందుకింత దుర్భర మయిన అవస్థను పొందుతాడు ?" అని చూచిన వారిహృదయం పరితపి స్తుంది. సహృదయుల గుండెలు కరిగిపోతాయి ఎందుకు ? వెన్నును అంటుకొని కాలి ఉన్న తన పొట్టకోసమా, ఈ నీచయాతనను పొందు తాడు? కాదు. తన ఆనందం కోసమా? తన వినోదం కోసమా ? కాదు, కాదు. అదే కారణమయినట్టయితే మానసం కలవాడు ఆత్మహత్య చేసు కుంటాడు. వాటి కోసముగా తన ఆత్మనీ,దేహాన్నీ చంపుకొ గలిగిన వాడు, దేహీ అని చెయ్యి చాచడానికి జంకనివాడు, మానసంఅన్నది లేనివాడే; నిర్వీర్యుడు, అల్పుడు అవుతాడు. పౌరుషం ఉన్నవాడికి తన పొట్టా తన కట్టూ యాచనకు కారణాలు కావు—కానేరవు

మరేమి టంటారా ? ఉంది, బలమైన కారణం ఉంది. ఈ మానిసికి ఒక కుటుంబం వుంది. ఆ కుటుంబంలో ఒక ఇల్లాలు, గంపెడు పిల్లలు వున్నారు. ఇల్లాలు నిత్యోపవాసాలతో నీరసించివుంది దీనురాలు; ముఖంలో దీనత్వం ఇల్లు కట్టుకొని వుంది. కట్టుకున్న దానిని చీర అనడం మరొక మాట లేకపోవడం చేతనే. అది చీరకాదు, కోకకాదు, వేయి చినుగుల వల. ఎట్లానో పొందుమీద పొరలుగా కట్టుకొని మానాన్ని చిక్కబట్టుకుంటుంది

తల్లి. తన దురవస్థకు ఏడవదు. భర్త బాధకు తల్లడిల్లి పోతుంటుంది. అతనికి ధైర్యం కలిగించడానికి, తనకు బాధ ఏమీ లేనట్టే కనబడుతుంటుంది. కాని. పిల్లలున్నారు— గంపెడని అన్నాను – పేదరికములోని పిల్లలేఅయినా, వాళ్ళకిగూడా కడుపు లుంచాడు ఆ 'భగవంతుడు.' దారుణం! ఆ కడుపులు మండుతుంటాయి. ఆకలి. ఆకలి. సొమ్మసిల్లి పోతుంటారు, బెప్పరిల్లి తల్లి దగ్గరకు పోతారు; ఆ చినుగుల చీరను పట్టుకొని లాగుతారు.

"అమ్మా! ఆకలి! ఏదయినా తినడాని కియ్యి!" అంటారు. ఏడుస్తారు. ఆ ముఖాలు. ఆ శరీరాలు. ఆ రోదన, ఆహా! ఎవ్వడు-ఏ రాతిగుండెవాడు— సహించగలడు? అలాంటి దీన అవస్థను చూస్తూ వుండగలిగినది ఏ రాయో, ఏ గోడో కావాలి. లేదా, ఏ 'భగవంతుడో' కావాలి. అంతే. జీవజంతువు ఏదయినా, ఎవ్వరయినా జాలితో నీరు కాకమానరు. ఈ స్త్రీని, ఆ చినిగిన చీరపట్టుకొని లాగుతున్న ఆ పిల్లల దీన ముఖాలనూ, "ఆకలి" ఏడుపులను చూస్తాడు భర్త— మానసం గలవాడు.

ఇంకెక్కడి మానసం! ఇంకెక్కడి పౌరుషం. యాచించడానికి బయలుదేరుతాడు. ఓర్వలేడు. ఇంక ఊరకుండలేడు ఆ దురవస్థ అంత కఠోరం! అన్నిటినీ చంపుకొని — సకలాన్నీ త్యాగంచేసి—ఆ దురవస్థను తొలగించడానికే పూనుకుంటాడు.

దీనా దీనముఖై స్సదైవ శిశుకైః
ఆకృష్ట జీర్ణాంబరా
క్రోశద్భిః క్షుధితై ర్నిరన్న విధురా
దృశ్యా నచేత్ గేహినీం.
యాచ్ఞాభంగ భయేన గద్గదగళ
త్రుట్యత్ విలీనాక్షరం
కో దేహీతి వదేత్ స్వదగ్ధ జఠర
స్యార్థే మనస్వీ పుమాన్.

(ఆకొని యేడ్చు లే జిరుత
అన్నముకై తన కొంగు లాగ పె
ల్లాకట సోలుచుండెడు ని
జాంగన దుర్దశ జూడదేని, యా
చ్నాకల౭ విభంగభయ
సంభృ౯ గద్గద ఘూన్యకంఠుడై
చేకొని దేహి యం చడుగ
జేరునె కాలినపొట్ట కెవ్వడున్ ?)
(భాషాంతరీకరణంలో కొంత భావం పారిపోయింది.)

ఈ "మనస్వి" నిరర్థకుడు కాడు. శక్తిమంతుడే. కష్టపడతాడు. తన ప్రయత్నం చాలింది కాదు. ఇంకా ప్రయత్నం చేస్తాడు; మానడు; కాని ఈ పిల్లలు, ఈ గృహిణి, ఎలా ఉంటారు ? ఎలా వుండగలరు? అని అప్పుడు అడగడానికి అడుగు వేస్తాడు. అంతేకాని, తన పొట్టకోసం కాదు. మానసం కరిగిన వాడొకడు అడిగాడు అంటే, అతని ఇంటిలోని దురవస్థ అలా ఉందని గ్రహించాలి, అలా గ్రహించ గలిగినవాడే మనిషి; గ్రహించి ఇవ్వాలి. అలా ఇచ్చినవాడే దాత.

పొంగిగాను నాకటన్ పొరలు
పుత్రుల బాష్పనిరుద్ధ దృష్టులన్
బరపుచు నెత్తి ఊరడిల
బల్కెడు సాధ్విని చూచి చూడన
ట్లరసి, నిజార్తి విస్మరణ
(యాచనదైన్యము బూనుగాక !)

అని అన్నాడొక నిగ్గుదేరిన కష్టజీవి. అడిగాడు అనగానే అతడు పడ్డ యాతనా, అతని ఇంటిలో ఉన్న ఈ దురవస్థా అంతా అలా కన్నులకు కట్టినట్లు కనబడాలి. అలా చూడడానికి హృదయం విశాలం ఉండాలి.

కాబట్టి, దాత అనిపించుకోవలసిన వాడి పనికూడా స్వల్పంకాదు. సులభం కాదు.

# అడిగేవాడి ఆలుబిడ్డలు

అడగడం అంటే కష్టం. మనిషి త్రిశూలయాతన పొందుతాడు. ఆ అభాగ్యుడు అడగడానికి కారణం-ఇంతకుముందు మనవి చేసినట్టు-ఆలుబిడ్డలు పడుతూఉన్న దురవస్థ, ఆకలి ఆకలి అని ఆక్రోశిస్తున్న పిల్లలు, బక్కచిక్కి పక్క యెముకలన్నీ పైకి కనిపించే పిల్లలు. మట్టి ముద్దయినా సరే తిని మంట చల్లార్చుకోడానికి సిద్ధంగా ఉన్న పిల్లలు.

వారుఏడుస్తున్నది దేనికోసం? వారుకోరేదేమిటి? బాగాఆలోచించండి మోటారుకారులో తీసుకుపొమ్మని ఏడవడంలేదు. పట్టుచొక్కా కుట్టించమని పోరుపెట్టలేదు. ఆటవస్తువులు కావాలని అల్లరి చెయ్యలేదు. వేడుకలకోసం వేధించలేదు. ఆకలిమంట ఆర్పడానికి ఇంత అన్నం పెట్టమనే ఆక్రోశిస్తున్నారు, ఆకలితో నుల్చుకు పోతున్నారు నోటి తడి ఆరిపోతూంది. మంటను చల్లార్చమని మాత చింకి చెరగు లాగుతున్నారు నిలబడడానికి శక్తిచాలక కిందపడి చుమ్మచుట్టలయి పొరలుతున్నారు. చంపేస్తూఉన్న ఆకలి సాధించమని తల్లిని వేడుతున్నారు.

పొరిగొను ఆకటన్ పొరలు పుత్రుల

అని కదా అన్నాడు. 'అమ్మా ఈ ఆకలితో చచ్చి పోతానే' అని అంటున్నారు ఒక్కొక్కరున్నూ.

ఆ పిల్లలను ఓదార్చలేని తల్లి. ఆకలి మంటను ఆర్పలేని తల్లి గుష్ఠ గుడ్డెడు నీళ్ళు కమ్ముకుంటాయి. దుఃఖాన్ని మింగుతుంటుంది. కంటనీరు ఆ తల్లి కారనీయదు. నిరోధించుకుంటుంది. యమయాతనను అనుభవిస్తుంది.

కన్నీరు కార్చదు—అశ్రువులు కారనీయకుండా ఆపుకుంటుంది. ఆత్మను నిరోధించుకొనడానికి ప్రయత్నిస్తుంది 'ుటకటు వేస్తుంది. కాని, గొల్లున ఏడవదు.

నిజం: ఎందుకో తెలుసునా? తన కంటినుంచే నీరు కారినట్లయితే, ఆ పిల్లలు గ్రహించుకొంటారు. ఆకలిమంట ఆర్చడానికి అమ్మ గూడా అశక్తురాలన్నమాట తెలుసుకుంటారు. ఆశ అడుగంటి పోతుంది. నిరాశ నిండిపోతుంది బెగ్గిలిపోతారు దద్దరిల్లిపోతారు. నిలువున నీరైపోతారు. పసిపిల్లలకు ఆ అవస్థ కలిగించడం కన్నతల్లికి మహాకష్టం. కడుపు తరుక్కుపోతూ ఉంటుంది: కాని కంటచుక్క రాల్చదు. అందుకే అన్నాడు కవి:

వాష్పనిరుద్ధ దృష్టులం బరపుచు
ఎత్తిఊరడిల పల్కెడు సాధ్వని

అని. మహా అనుభవంతో చెప్పిన మాటలు. అందులోని ప్రతి అక్షరమూ సత్యమే.

అటువంటి స్థితిలో ఉన్నారు ఆలూ బిడ్డలున్నూ. చూచినవారి గుండెలు నీరుకాక తీరవు. పయివారికయినా, పాషాణ హృదయాలకయినా, కంట తడి తగలక మానదు. అలాంటి దురవస్థలోవున్న భార్యను చూస్తాడు. ఆ యమ్మకు భర్త, ఆ పిల్లలకు తండ్రి వారిద్దరినీ భరించి పోషించి కాపాడవలసినవాడు. వారికి ఆకలి అన్న మాట కలగనీయడమే తన లోపము అని తెలుసుకోగలిగిన పురుషుడు. అట్టి వారిచేత ఆకలి అని అడిగించడం మహా ద్రోహం అని గ్రహించగలిగే బుద్ధిమంతుడు. అలా అడిగినప్పుడు గూడా ఆ బాధ తీర్చలేకుండా ఉండడం కంటే దైన్యం మరొకటిలేదు అని తెలుసుకోగలిగిన మనస్వి. ఇతడు చూస్తాడు ఆ తల్లీ పిల్లలు పడుతూ ఉన్న యాతన అంతా చూస్తాడు.

అదయినా ఎలాగచూస్తాడు? దాహాటంగా చూడలేడు. అలా చూడటానికి గుండె దిటవులేదు—అంతకుముందే ఆ గుండె నీరయి ఉంటుంది.

ధైర్యం చాలదు. అందుచేత చాటునవుండే చూస్తాడు. వారికంట పడకుండానే చూస్తాడు. తాను పడుతున్న హృదయావేదన తనకు తెలుసును. ఆ తల్లి ఎంత పరితాపం పొందుతూ ఉంటుందో తాను గ్రహించ గలడు. దుఃఖాన్ని ఆమె ఎంత ప్రయత్నంతో ఎలా ఆపుకుంటుందో ఎరుగును అందుచేత. అతను తటాలున వారి ఎదట పడి చూడలేడు. గబాలున వారి దగ్గరకుపోయి చూడలేడు. తాను చూస్తున్న సంగతయినా వాళ్ళకు తెలియకుండా చూస్తాడు.

.ఎత్తి ఊరడిల బల్కడు
సాధ్విని చూచిచూడన ట్లరసి

ఆ సాధ్విని, పిల్లల బాధతో పేగులు కలగిపోతున్న ఆ ఇల్లాలును చూచి చూడనట్టు చూస్తాడు

చూస్తాడు! ఎంత చిన్నమాట! ఎంత తేలికగా అంటాము. కాని, అతని అవస్థ—చూచేసరికి, సూదులు గుచ్చుకుంటాయి కళ్ళలో. శూలాలు గుచ్చుకు పోతాయి హృదయంలో. కడుపులో చెయ్యిపెట్టి కలిచి వేసినట్లవుతుంది. పై ప్రాణాలు పైనే ఎగిరిపోతాయి నిర్విణ్ణుడయిపోతాడు. పాదాల క్రిందనున్న భూమి పగిలిపోయినట్టూ, తాను పాతాళగహ్వరంలో పడిపోతున్నట్టూ అనిపిస్తుంది. ఏడవలేడు, చూడలేడు తెరిచే ఉంటాయి కళ్ళు కాని, దృష్టి చచ్చిపోతుంది. చెవులు వినబడవు. బతికే ఉన్నా, ఒక్క క్షణ కాలం చచ్చినవాడితో సమానుడయిపోతాడు చైతన్యం తిరిగి వచ్చిన తర వాత గూడా మరొక్క క్షణం మనవాడు కాడు ఏదో స్వప్నావస్థలో ఉన్న ట్టుంటాడు. ఏవో కళ్ళకు కట్టినట్టు కనిపిస్తాయి. ఏదో సినిమాలో తన చరిత్ర చూస్తూ ఉన్నట్టుంటాడు తన తెలివి తెల్లవారిందన్న సంగతి పెద్దక్షరాలతో (గ్లోజప్పులో) కనబడుతుంది. తన శక్తి ఒక మిధ్య అని అనిపిస్తుంది ఇక లాభంలేదు అని గ్రహిస్తాడు.

'అన్యథాశరణం నాస్తి'

అని ఒక్క నిట్టూర్పు దీర్ఘంగా విడుస్తాడు.

దానితో ఆ స్వప్నావస్థ పోతుంది; జాగ్రదవస్థ కలుగుతుంది. దానితో తన పౌరుషం, తన మానసం అన్నీ చంపుకుంటాడు. 'యాచ్ఞా భంగ' భయాన్ని నరికివేస్తాడు. కాదు, కాదు, నరికివేశానని అనుకుంటాడు. పోయి అడుగుతాను అని నిశ్చయించుకుంటాడు. అడగ గలుగుతానని అనుకుంటాడు. ఆ ధైర్యం ఉంటుందని ఊహించుకుంటాడు. బయలుదేరతాడు. 'దేహీ' అన్న మాటను ఉచ్చరించడానికి అడుగు వేస్తాడు.

పాపం! ఎరగడు, ఆ ధైర్యం తనకు ఉండదని తెలియదు. అడగడం అంత సులభమయిన పనికాదు అని గ్రహించలేడు. అది త్రిశూలయాతన అని పోల్చుకోలేడు. ఆలుబిడ్డల ఆవేదనే కనబడుతుందిగాని, ఆవల అడిగే టప్పుడు పడేపాట్లు కనబడవు. నోరాడకా, గొంతు వినబడకా, మాటలు తెగి పడుతూ, అక్షరాలు లోపిస్తూ, మహా దురవస్థలను భరిస్తాడని తెలుసుకో లేడు.

భోజనం దేహి రాజేంద్రా

భోజనానికి లేదయా

అన్నట్టు నాలుగు మాటలు చెప్పబోయి 'టెంకాయ పిచ్చికొండ' చేస్తాడని అనుకోడు పాపం!

ఇంత మహా యాతనతో అడుగుతాడు. దాతకు తన ఇంటిలోవున్న దురవస్థ మనవి చేసుకుంటాడు. ఏదయినా సాయం చెయ్యమని యాచిస్తాడు.

నీవే తప్ప నితఃపరం బెరుగ

మన్నింపందగున్ దీనునిన్

అన్నట్టు అర్థిస్తాడు.

అయినా కొందరు "దాశిలు" పొమ్మంటారు. వారికి నోరెలా వస్తుందో? ఎవరయినా చెప్పగలరా? పండితులుగాని, పరమహంసలు గాని చెప్పగలరా ? అంత ఎందుకు? ఆ నోరులతో ఆ "దాతలను" సృష్టిచేసిన ఆ భగవంతుడు చెప్పగలడా? ఆ నిర్భాగ్యుని పొమ్మనడానికి నోరెలా వస్తుందో ? ఆ దీనుడిని పొమ్మనడానికి సాహసించినదీ ఒక నోరా ? కాక పోతనామాత్యుడన్నట్టు—

ధమ ధమ ధ్వనితోడి ఢక్కగాక?

అది నోరా, మారణ ధ్వనిచేసే ఒక మహామారి యంత్రమా? అంటే తప్పా ?

# భూమికి బరువు

ఒక పెద్దమనిషి అడిగాడు అంటే అంత దురవస్థ ఇంట్లో ఉందన్న మాట. అతడు తన హృదయంలో అంత యాతన అనుభవించాడన్నమాట అడగడంలో అంత ఆయాసం పడ్డాడన్నమాట.

'పెద్దమనిషి' అని అనడానికి ఒక్క కారణం ఉంది. ఎందుచేత నంటే—రక్కన అడిగే వాళ్ళని ఈ జాతిలోనుంచి తొలగించడానికి అడగడమే వృత్తిగా పెట్టుకున్నవారు ఇందులో చేరరు. ఏమిటి చేస్తుంటారండీ అని అడిగితే 'యాయవారం మావృత్తి' అనిచెప్పే పెద్దలు ఇందులో చేరరు. బ్రహ్మదేవుడు మమ్మల్ని అడుక్కొని బతకమన్నాడు అని సగర్వంగా చెప్పేవారూ ఇందులో చేరరు.

రోగంచేతగాని, వికలాంగులుగా వుండడంచేతగాని, గత్యంతరం లేక అడుక్కోవలసిన వారుగూడా ఇందులో చేరరు. వారు మొదట అడగడానికి ఎంత దురపిల్లినా, అభ్యాసబలంచేత అడుక్కోవడమే వృత్తి అయిపోయింది. వారు మర్యాదగా బతకడానికి తగిన ఏర్పాట్లు ఈ సంఘం చేయలేదు. వారి ఆకలి చిచ్చును సంతృప్తి పరచడానికి మన మానవోత్తములు దీనికన్నా మరొకదారి చూపించలేక పోయారు కాబట్టి ఈ వికలాంగులూ, ఈ కుష్ఠు రోగులూ, అపతల దేవుడిని తిడుతూ ఇవతల మానవ సోదరుల ఏర్పాట్లకు వుసూరుమంటూ బతుకుతారు మానవ హృదయంలో వున్న నీచత్వానికి వీరంతా స్మారక చిహ్నాలు. మనుష్యుల దుష్టత్వానికి వీరంతా సజీవంగా వున్న మాన్యుమెంటులు. వీరికి అడగడం అభ్యాసం అయిపోయింది. వారి

దోషం ఏదీ లేకపోయినా, అందుచేత వీరినికూడా పైనచెప్పిన "పెద్ద మనుష్యు"లలో చేర్చవద్దు.

అడగకుండా కాలక్షేపం చేదామని ప్రయత్నంచేసి బతికిన వారినే ఇందులో చేర్చాలి. ఆత్మకుటుంబం పడుతూవున్న బాధ అన్యులకు కనపడ నియకుండా గుట్టుగా బతకాలని ప్రయత్నం చేసే వారినే ఇందులో చేర్చాలి విద్యా, బుద్ధీ, బలమూ, ఓపికా, ఎన్ని వున్నప్పటికీ; ఒకరిని అడగకుండా కాలక్షేపం చెయ్యలేకుండా అవస్థ పడుతున్న వారినే ఇందులో చేర్చాలి. తగిన అవకాశం ఇస్తే, తానేపదిమందికి పెట్టగలిగిన వాడయినప్పటికీ, "దురదృష్టం"చేత అడగక తప్పని అవస్థకు వచ్చినవారినే ఇందులోకలపాలి.

అటువంటివాడు అడిగినప్పుడు అతను అడిగాడని భావించడంతప్పు, అధర్మం, ఇవతలివాడికి ఒక్క మహావకాశాన్నిచ్చాడన్నమాట గ్రహించాలి. దాత అనిపించుకోడానికి ఒక మంచి సదుపాయాన్ని కలిగించాడు. అప్పుడు ఆ మహా దురవస్థలో వున్నప్పుడు ఒక్క చిన్న సహాయం చేసినట్టయితే, అడగడానికి వచ్చిన ఆ మహానీయుడు ఆత్మహత్య చేసుకోడు; అటువంటి వాడు బతికాడు అంటే ప్రపంచానికి ఎంత లాభం ! అతని మేధాశక్తితో లోకానికి ఎంత ఉపకరించవచ్చును . ఎన్ని మహోత్తమకార్యాలు చేయ వచ్చును! ఎంత విజ్ఞానం కలిగించ గలుగును! ఆ సమయంలో, సకాలంగా, ఆ స్వల్ప సదుపాయం చేసినవాడిది కదా ఆ పుణ్యం, ఆ కీర్తి అంతాను. అటువంటి మహావకాశం కలిగించాడు అడగడంవల్ల.

ఈ మాటల అర్థం చక్కగా తెలియాలి అంటే మరేమి చెయ్య నక్కరలేదు. అతడున్న అవస్థ, అతడి ఆలుబిడ్డలున్న అవస్థ, అంతా తెలుసుకదా, ఇప్పుడు, ఆ దాత లేదు పొమ్మన్నాడనుకోండి. తరువాత అతడి చరిత్ర ఏమవుతుంది ? కొంచెం ఊహించండి. గుండెలు బద్ద లవుతాయి. గాని సామాన్యమా ? ఏమి చేస్తాడు ? తన ఒక్క ఆశ నిరాశ అయిపోయింది. కావలసిన సహాయం చిక్కలేదు. అన్యథా గతిలేదు.

ఇంటికి పోగలడా? ఎలా పోతాడు? ఆనురాప్పుడు అని చూస్తున్న ఆ ఇల్లాలికి ఏమని చెప్పగలడు? వట్టిచేతులతో ఇంటికి పోయిన ఏమగును? ఇంతవరకు తల్లి ఏమని ఓదార్చినదో తెలుసును కదా పిల్లలను? అదిగో నాన్న వెళ్ళాడు ఏదయినా తెస్తాడు, ఒక్క క్షణం ఉండండి అని కదా పిల్లల గోడును తగ్గించింది? ఇతడు చేతులు వేలవేసుకొని పోయిన—పిల్లలు, తల్లీ మొదట చూచేది చేతులు కదా? — తల్లే మగును? పిల్ల లేమగుదురు ఆ నిరాశ, ఆ ఆశా భంగం, తన వ్యర్థత్వమూ అన్నీ తాను చూసి ఎలాగా సైరించగలుగును ? ఆ దురవస్థను చూడటానికి ఇంటికి తిరిగి వెళ్ళ గలుగునా ? వెళ్ళలేడు—వెళ్ళడు.

వెళ్ళకుండా వుండగలడా ? చూడండి. వెళ్ళకుంటే, అయ్యో ! పిల్ల లేమవుతున్నారో అన్న చింత వెంటాడుతుంటుంది. ఎంత ఏడుస్తున్నారో, ఆ చిన్న పిల్ల ఎంత దురపిల్లుతూ వుందో ఈ చిట్టివాడు ఎంత సుళ్ళుకొని పోతున్నాడో, ఆ పెద్ద పిల్ల ఎంత దుఃఖం ఆపుకున్న వీలులేక ఎరితిని ఘోరున ఏడుస్తువుందో. ఈ ఆలోచనలు యమ దూతలలాగా పీడించవా ? ఇంత దుఃఖభారాన్ని ఇంట్లో వుంచి, దానిని సరిచూచుకోమని తన భార్యను విడిచిపెట్టి నట్టేకదా? తాను చూడలేక పారిపోతున్నాడు; అటువంటి బాధను సమాలించుకో అని తన ఇల్లాలును విడిచిపెట్టి నట్టయింది ఎంత నీచుడను అనుకోడా ? ఆశాభంగానికి తాను ఇలా అడవులపాలయిపోయినప్పుడు, ఆ అబల ఆత్మహత్యకు ప్రయత్నించడం తప్పా; అని మనసుకు తట్టుతుంది: అయ్యో ! పాపం ! నా నిరర్థతకు ఆ అమాయకురాలిని, ఆ సాధ్విని బలిచేస్తున్నానే అని ఘోరంగా దుఃఖిస్తాడు. ఆ పిల్లలేమవుతారో అని గోదుమంటాడు. అందరూ కలిసి ఒక్కసారే బలవన్మరణానికి బలిఅయిపోతారేమో ? ఊహకే మనసు ఝల్లుమంటుంది. భరించలేడు, కాబట్టి ఇంటికి పోకుండా వుండలేడు. పోవాలనుకుంటాడు.

మళ్ళీ పోతే కలిగిన బాధలు కంటికి కనబడతాయి; హృదయాన్ని పీడిస్తాయి పోవద్దనుకుంటాడు ఇలాగ ఆందోళనకు పడతాడు పోవడమా. మానడమా అని. రెండువైపులా దుఃఖమే మహా సముద్రంలాగా కనబడుతుంది. రెండు వైపులా అగాధమయిన పాతాళ బావులే గోచరిస్తాయి రెండు విషయాల్లోనూ యమయాతనే కలుగుతుంది. రెండు పక్షాలా తలలో పాములూ, తేళ్ళూ పాకుతుంటాయి. పిచ్చెత్తి పోతాడు వెర్రి అయిపోతాడు. దిక్కూ మొక్కూ తోచదు ఏమిచేయడమో ఎరగడు. ఏమి చేస్తాడో తెలియదు ఒక మాను అయిపోతాడు ఒక రాయి అయిపోతాడు. ఒక పాషాణం అయిపోతాడు. అటు ఆత్మహత్య అయినా చేసుకుంటాడు; ఇటు అతి దారుణంగా ఏ ఖూనీకో ఏ దొంగతనాన్నో చేస్తాడు; నిజం అతనిలోని మనిషి చచ్చిపోయాడు. పశువు మాత్రం మిగిలి వుంటుంది అదిగూడా పాషాణ హృదయంతో ఇంక అతన్ని అనవలసిన పనిలేదుకదా,

ఈ దాత "లేదు" అన్న రెండక్షరాల ఫలితం చూచారా? పైకి రావలసిన ఒక మహావ్యక్తిని పశువుగా పాషాణంగా చేసింది. తన బుద్ధిబలం చేతనూ, తన శక్తితోనూ, మానవ అభ్యుదయానికి తోడు పడదగిన ఒక మహావ్యక్తిని బలవంతంగా చంపింది. అతని విజ్ఞానంవల్ల లాభం, అతని కౌశలంవల్ల ఫలితం ప్రపంచానికి లేకుండా చేసింది అతనికీ, అతని కుటుంబానికే కాకుండా సర్వమానవ ప్రపంచానికీ నష్టం కలగచేసింది జగత్తుకే ఒక మహా వుపద్రవం తెచ్చిపెట్టింది. లోకానికే ఒక గొప్ప ప్రమాదం కలిగించింది.

ఇంతకు కారణం తాను లేదన్నది ఈ "దాత." ఒక్కరూక. కాదు—నిజంగా అది ఒక్క ఈక ఇవ్వడానికి వెనుక తీశాడు. అల్ప సహాయం చెయ్యడానికి చేతులు వచ్చాయి కావు. తన యింటిలో వున్న కుక్కకు పెట్టిన ఖర్చులో ఒక పదవ వంతుకాదు ఆ అభాగ్యుడు అడిగినది తానూ తన పిల్లలు ఒక్క గంటలో కేవలం వినోదాల కింద ఖర్చుపెట్టిన దానిలో ఒక్క అణుమాత్రంకాదు ఆ నిర్భాగ్యుడికిలేదన్నది. ఆడంబరం

బరం కోసం, వేడుకకోసం ప్రతిదినమూ తాను వ్యయం చేస్తున్న దానిలో నూరోవంతు ఇచ్చినట్టయితే ఆ దరిద్రుడు ఈ పాషాణం కాదు. అల్పాతి అల్ప సహాయం చేసినట్టయితే ఆ హతభాగ్యుడికి మానవ లోకంమీద ఇంత చెడ్డ అభిప్రాయం కలుగదు. జీవితంమీద ఇంత రోత పుట్టదు. ఇంత దారుణ కార్యానికి దిగడు

కాబట్టి, ఆ అడిగిన వాడికి "లేదు" అన్న బదులు చెప్పగలిగినవాడు ఇంత ద్రోహం చేసినవాడని అంటే తప్పా? ఆ "దాత" మహా ద్రోహి అని చెప్పితే ద్రోహమా? అతడననినది మారణ మంత్రమే అని అంటే దోసమా? అది నోరా! ఆ "లేదు" అన్న మాటను ఉచ్చరించినది? కాదు; అటాంటి జవాబు చెప్పగలిగిన నోరూ, హృదయమూ వున్నవాడు మనిషి అవుతాడా? ఈ ఖూనీ చేసినవాడు ఆ దాతే కదా? ఆ పిల్లల ఉసురు పోసుకున్నవాడు ఆ దాతే కదా? ఆ ఇల్లాలిజీవనానికి కురార మయినవాడు ఈ దాతే కదా? లోకానికి ఇందరివల్ల సేవ లేకుండాచేసినవాడు ఈదాతేకదా? ఇటువంటి దాత ఎవరయితేనేమి? ఎంత ధనికు డయితేనేమి? ఎన్ని గొప్ప పనులు చేసినవాడయితే నేమి? ఎందరికి ఎంత ఇస్తేనేమి? ఈ మహాపాపానికి ఈ దాత వట్టి రోతకాడా? మహా పాపికాడా. పరమ దుర్మార్గుడు అంటే ఇంకా ఎవడో వున్నాడా? అందుచేతనే అన్నాడు, కవి ఇలాంటి వాడిని గురించి:

వా డొకరుండె భరంబు ధాత్రికిన్:
కానలు కావు; శైలస్థులు కావు;
పయోధులు కావు భారముల్.

ఈ'దాత' ఒక్కడే భూమికి బరువట. ఈ అడవులూ, ఈ సముద్రాలూ, ఈ కొండలూ బరువు కావట; భూదేవి వీటినన్నిటినీ మోయగలుగుతుందట. కాని, ఇలాంటి వాడిని ఒక్కడినిని మాత్రం మొయ్యలేనని మొర్రపెడుతుందట. అలాంటి అడిగినవారికి "లేదు" అన్నమాటలో ఖూనీ వుందని వారు గ్రహించాలి. అది గ్రహించిన వాడే దాత తక్కినవాడుకాదు.

# దాతలకు కలిగే పాతకాలం!

అభిమానం కలవాడిచేత అడిగించడమే ఒక మహాదోషం సంఘానికి. అలా అడిగినప్పుడు లేదనడం అంతకన్నా మహాపాపం. ధనం ఉన్నవాడు, ఒకరికి ఇవ్వడానికి శక్తి ఉన్నవాడు అక్కడా ఇక్కడా ఇచ్చినందువల్ల దాత అనిపించుకున్నవాడు, లేదంటే మహాఘోరం. మానసం గలవాడు, అడగడం కోసం తన సర్వస్వం త్యాగం చేసుకున్నవాడు, అడగలేక అడగలేక అడిగినవాడు అడిగినప్పుడు లేదనడమా?

ఈ శాంతికనీ, ఆ పుణ్యాహవాచనానికనీ కర్చుపెడతాడే. ఈ అర్థి ఇలా కృశించిపోతూ ఉంటే, తాను అనిన "లేదు" అన్న మాటతో ఆత్మహత్యకు చూస్తూవుంటే ఆ దాతకు శాంతి ఎక్కడనుంచి వస్తుంది? ఆ పుణ్యాహవాచనంవల్ల లాభం ఎలా కలుగుతుంది. అతడు నిజమైన దాత అవుతాడా? పెద్దలు, పెద్ద పెద్ద పొట్టలుకల బ్రాహ్మణులూ పొగడాలన్న ఉద్దేశంతో చేసిన పనే అవుతుంది కాని, తన కర్చు ఇంకొకలాగా పేరుకెక్కుతుందా?

భూతదయకోసం, జంతుసంరక్షణకోసం అని కొంత డబ్బు ఖర్చు పెడతాడు. కుక్కలకూ నక్కలకూ కొంత పైకం వ్యయంచేస్తాడు. దానితో పెద్దలూ దొరలూ తన పేరు వింటారనుకుంటాడు. లేదా, దానితో మోక్షం చూరగొంటా ననుకుంటాడు. మూర్ఖబుద్ధి! జంతువులలోకెల్ల మహాజంతువు మనిషి. వాటిలో మానసం కలవాడు మణిపూస; సోదర మానవుడు. అలాంటి జంతువు అష్టకష్టాలు పడుతూ అడిగి లేదనిపించుకొన్న యాతనను అనుభవిస్తూంటే, ఇతనికి భూతదయ ఎక్కడఉంది? ఆ మాటకూ, ఈ దాతకూ

ఎంత దూరం ! ఇంతకంటే హింసాపరుడు మరొక్కడుంటాడా ?

విద్యాలయాలూ, ఉచిత వేతనాలూ నెలకొల్పానని గర్వం ! అవును గర్వమే. కేవలం మెప్పుకోసం చేసినపని; పత్రికలకు ఎక్కుతుందన్న ఆశ, ప్రకటన — అడ్వర్ టైజుమెంటు — కోసం చెల్లించిన పైకం. అంతే ఈ ఔదార్యం అంతాను. అలాంటి పటాటోపానికీ, అలాంటి ప్రఖ్యాతికీ ఇక్కడ విలులేదు. ఈ అభాగ్యుడు ఏపాటి ప్రకటించ గలడు ? వీడికిస్తే పేరా ? ఊరా ? కాబట్టి ఈ దాతకు చేతులురావు. ఇలాంటివాడు ఎంతచేస్తే మాత్రం ఏమిలాభం ! విద్యాస్థానం లాగున్న ఈ అర్థిని, విజ్ఞాన ఖనిలాగా ఉండదగిన ఈ అభాగ్యుడిని, ఇంత అవస్థ పాలుచేసిన ఈ దాతకు విద్యాలయ స్థాపన కీర్తి వస్తుందా? సక్రమ ప్రపంచంలో రాగఁదా ? అలా వచ్చింది ఏదయినావుంటే అది సరియయిన కీర్తి అవుతుందా ? వట్టి బూటకమూ, మోసమూ కాక మరేమిటి?

ఈ ఆడంబరం అంతా పేరుకోసం ప్రాకులాడడం, మెప్పు కోసం చేయడం. విలాసాల కోసం దేవులాడడం. అంతేగాని ధర్మం ఆచరించడానికి కాదు. ఇలా ఇచ్చినదంతా అక్రమ వ్యయం. అధర్మం లేనివాడు దురవస్థలలో పడి, భార్యా పిల్లలతో ఏ చెరువులోనో, బావిలోనో పడబోతూ వుంటే, ఉన్నవాడికి ఆ పేరుతోనూ, ఈ పేరుతోనూ ఇచ్చేవాడినిఏమనడం?

పెక్కు చందాలన్ పండు, ఒకప్పుడున్
తిరుగ దింటన్ పాడియున్ పంటయున్

అన్నట్టులున్న ఏ ప్రవరాఖ్యుడినో పిలిచి పదివేలు ఇస్తే ప్రయోజనం ఉంటుందా? ఆ పక్కనే, వెన్నునంటుకొన్న డొక్కలతో మలమల మాడిపోతూ, మృత్యుదేవతకు బలి కానున్నవారు ఉండగా ఈ దానం దానం అనిపించుకుంటుందా ? అలాంటి దానాలు చేసినవాడికి పుణ్యం కలుగుతే, బాలఘాతకులకు, బందెపోటుదారులకు, ఖూనీదారులకు ఎందుకు కలుగదు

పుణ్యం ! వీరు చేసింది ఖూనీకాదా ? ఆ శిశువులు, ఆ అడుది ఆకలి ఆకలి అని అరచి చచ్చుటకు కారకులు ఈ దాతలే కదా ! ఒక్క—కాసు, ఒక్క వీసమయినా-సరే వీరే దయతో వారిమీద పారవేసినట్టయితే, వారికి ఆ బల వన్మరణం ఎందుకు కావలసి వుంటుంది ? ఈ దాతలు దానిని చూడరు. పేరుకోసం చూస్తారు. "ఏమి సంతర్పణ చే యిం చా రం డీ, లడ్డూలూ, జిలేబీలు, పాయసంతో" అని అనుకుంటారు కదా. దిడ్డి సంభావనే అర్ధ రూపాయిలు అని చెప్పుకుంటారు కదా అన్న ఆశతో ఇచ్చినది ఈ పైకం. బజారులో ఇలా పుణ్యం కొనడానికి చూచిన వెంగిలితనం, అది ధర్మం అని పించుకోలేదు. వారు దాతలు కాలేరు. అది దానంకాదు, సోదరమానవహత్య.

ధర్మం అంతా దానం అయింది. ఇప్పుడు దానం అన్నది సోదర హననం, మానవహత్య క్రింద పరిణమించింది. దానం అన్న పేరున, మతం అన్న మిషతో ఘోరాలు జరిగిపోతున్నాయి. అక్రమం, అన్యాయం, అప స్మారం ఇవే వ్యాపించిపోయాయి. దీన్ని చూచారు బుద్ధిమంతులు. గుండెలు బాదుకున్నారు. తప్పు గుర్తించారు. దీనిని సరియయిన దారిలోనికి తిప్పితేనే గాని వీలులేదని గ్రహించారు.

కాని, ఎలా తిప్పడం? అగ్రజాతులు ఊరుకుంటాయా? ఇన్నాళ్ళూ అనుభవిస్తున్న హక్కులు పోగొట్టుకుంటారా? నరకకూపంలో తోసివేయరా? అందుచేత మొండిపట్టు పట్టలేక పోయారు ఈ బుద్ధిమంతులు కూడా. అట్టే కటువుకాకుండా, అంత మెత్తన కాకుండా, ఒక ఉపాయం పన్నారు. అంత కన్న వేరే మార్గం వారికి కనబడలేదు. ఆపాటి అయినా చేసినందుకు సంతోషించాలి.

ఈ బుద్ధిమంతులు చేసినది ఏమీలేదు. ఈ దానం అన్నది కళ్ళు మూసుకొని చేసే ఒక పని కాదనీ, ఇచ్చినదంతా దానంకిందే రాదనీ ఒక విసురు విసిరారు. దానం అన్నది ఒక విద్య అన్నారు. దాని రహస్యాలు తెలుసుకోవాలన్నారు. అందుకొరకు కొంత కృషి అవసరం; అందులో ఉచితం అనుచితం అన్న భేదం ఉందన్నారు. పాత్రదానం అపాత్రదానం

అన్న విభేదం ఏర్పాటు చేశారు. అపాత్రదానంవల్ల నరకం, పాపం వస్తుం దన్నారు. ఇవ్వడానికికూడ కొంత అదురూ బెదురూ అన్నవి కల్పించారు.

దానవిద్యా పరతంత్ర మానసుడు

అన్నారు ధర్మరాజును. దానం అన్నదానిని విద్యగా కృషిచేసి, దానిలోనే ఆసక్తి కలవాడట ధర్మరాజు. శ్రీనాథ మహాకవి (అంటే సంస్కృత కవి శ్రీహర్షుడు గూడా) దానాన్ని గురించి కొన్ని పద్యాలు చెప్పాడు. పాత్ర అపాత్ర దానా లున్నమాట తెలియక దాతలుచేస్తూ ఉండిన అపాత్రపు పనులతో శ్రీనాధుడు గూడా విసిగిపోయాడు. హృదయం మండింది. ఆ దాతలు అర్థులను పెట్టిన అవస్థలు బాగా తెల్సుకున్నాడు. లజ్జతో అడిగే వారు ఎంత సంకట పడతారో ఎరుగును. అటువంటి వారికి లేదనడం ఎటువంటిదో, రేపురా, మాపురా, అని అవసర సమయం దాటి పోవడం అంటే ఎంత ఘోరమో గ్రహించాడు - అంటాడు:

కటికతనంబు మాన్పి, చటుకాకు
      విడంబముగూర్చి, లజ్జసం
కటపడజేసి, అర్థి కడు
      కారియ పెట్టెడు పాతకంబు అ
క్కట ! తొలగంగ జాలునొకొ
      కాలవిలంబము నాచరించి, పి
మ్మట తదభీప్సితార్థము
      సమర్పణచేయు ప్రదాత యెమ్మెయిన్

అని కటువుగా చెప్పాడు. ఎప్పుడో ఎంత ఇచ్చినా లాభంలేదు . అర్థిని ఈ అవస్థకు తెచ్చిన దాత ఆ పాతకాన్ని తప్పించుకోలేదని గట్టిగా చెప్పాడు. సకాలంగా పాత్ర దానం చెయ్యనివాడు ఎంత ధనం ఇచ్చినా పాతకుడే అని నిరాఘాటంగా తెలియజేసి ధన్యుడయాడు.

దానకలా కలాపసముదంచిత
సార వివేక సంపదన్
మానిత యాచమానజన
మానస వృత్త్యభి పూర్తి బుద్ధి పె
వ్వానికి లే దొకింతయును
వాడొకిరుండె భరంబుధాత్రికిన్
కానలుకావు, శైలములు
కావు, పయోధులు కావు భారముల్.

దానం అన్నది విద్య. దాని సంగతి తెలిసినవాడు అర్థిని ఆయాస పెట్టకూడదు. వచ్చినంత మాత్రం చేతనే గ్రహించాలి. ఒక్క మాటను అతడు అనగానే పది విషయాలను అవగాహనం చేసుకోవాలి. అడగడంలో ఉన్న లజ్జను సంకటాన్ని అతనికి కనబడకుండా చెయ్యాలి. అతని మనస్సులో ఉన్న కోరికను బోధపర్చుకోవాలి. ఆలస్యం చేయకుండా, ఆయాసం కలుగనీయకుండా, ఆ కోరికను సఫలం చెయ్యాలి. అలా చెయ్యనివాడు భూమికి బరువట. మహా బరువట. ఈ భూదేవి —ఇంతకు ముందు నేను చెప్పినట్టు—ఎలాంటి బరువయిన వస్తువు నయినా మోస్తానంటుంది గాని, ఇలాంటి అయోగ్యపు దాతను మోయలేనంటుందట. ఈ అడవులూ పర్వతాలూ ఈ మహాసముద్రాలూ ఇవన్నీ అంత బరువుగా కనబడవట భూదేవికి. సంగతులు గ్రహించి అడిగిన వాడికి అర్హ విధంగా సహాయం చెయ్యని ఈ దాత ఉన్నాడే, వీడిని మాత్రం మోయలేక మొర్ర పెడుతుందట.

కటువయిన మాటలు అయినా సత్యమయినవి. లక్షమంది అడిగే వారున్నా ప్రమాదంలేదు ; గాని, ఇలాంటి దాత ఒక్కడుంటే దేశానికి నష్టం. ప్రపంచానికే సిగ్గుచేటు. అతడి ఐశ్వర్యం నిరర్థకం; అతని త్యాగానికి అర్థంలేదు. అతని జీవితమే వ్యర్థం. ఎందుచేతనంటే ఒక్క సంగతి. తన ధనం ఎక్కడిది? తన ఐశ్వర్యం ఇచ్చినవారెవరు? సంఘం ఇచ్చిందే. తాను మంత్రించి డబ్బు చెయ్యలేదు. కదా! ఒకవేళ అలా చేశాడన్నా అ

మంత్రం ఇచ్చినది గూడా సంఘమే. సంఘంవల్లనే తాను బాగుపడ్డాడు. తనవల్ల సంఘం బాగుపడేటట్లు చెయ్యడం తనకు విధి. తన సంఘసోదరుడి కష్టం తాను తొలగించడం తన ధర్మం. చేతనయినంత వరకు సహకారం చెయ్యడం తన కర్తవ్యం. కష్టదశయందు మంచివాడు చిక్కుకొని పోయినప్పుడు, గొప్పవాడయితే కొంత ధన సహాయం చెయ్యాలి; పిడికెడు పెట్టడానికి వీలులేని పేద అయితే, ఒక్క కన్నీటిచుక్క కార్చాలి. ఈలాగున చేసిన వీరిద్దరే మనుష్యులు. తక్కిన వారంతా మానులు. మట్టిముద్దలు. ఆ పని చేయనప్పుడే వీరు భూమికి బరువులవుతారు సత్యం కాదా శ్రీనాధుడి పద్యం?

# "రేపు — మాపు" దాతలం

అభాగ్యుడు; ఆలుబిడ్డలతో అవస్థలు పడతాడు. అన్యులకు తెలియ నీయకే అష్టకష్టాలు పడతాడు. రవంతయినా దారికనబడదు. విధిలేక ఆత్మను చంపుకొని అడగడానికి వస్తాడు

దాత కిదా అని వస్తాడు; ధర్మబుద్ధి కలవాడనివిన్నాడు కాబట్టి వస్తాడు; మంచి చెడ్డలు గ్రహించగలిగిన మనిషికదా అని వస్తాడు. ఎప్పుడూ నోరు విడిచి అడగనివాడే అని ఇంతయినా ఆలోచించడా అని వస్తాడు. పేరుకు తగిన పెద్దతనం ఉండకపోతుందా అని వస్తాడు.

ఆ రావడం, నిజంగా ఆలోచిస్తే, దాత అనిపించుకునే వాడికి ఒక అగ్నిపరీక్ష. నిజానిజాలు బయటికిదేశ్చే శక్తిగల ఒక మహా అవకాశం. ఆ రావడంతో అసలు గుణాగుణాలు తేలిపోతాయి. మంచి బంగారమేదో, మాయ బంగారమేదో బట్టబయలవుతుంది. ఏమంటారా?

ఇంగితజ్ఞానం కలవాడూ, ఉత్తమ దాత అనిపించుకోవలసినవాడూ, అతనిచేత అడిగించుకోడు. వచ్చి రావడంలోనే—అతడు నోరు కదిపీ కదప కుండానే, పరిస్థితులు గ్రహించుకుంటాడు. అడగడంలో అతడు ఎంత దుర వస్థ పడతాడో ఊహించుకుంటాడు. అంచేత అతడిని అడగా అడగనీయడు. ఆ దైన్యాన్ని అనుభవించనియ్యడు. అడగవచ్చిన వాడి అభిప్రాయాన్ని పూర్తిచేస్తాడు. అంతేకాదు. ఇచ్చినది చాలా స్వల్పమన్నట్లు మాటలలో తెలుస్తాడు. మరి పదిసార్లువచ్చినా రావచ్చునన్నట్లు ధైర్యం కలిగిస్తాడు. (కాని, మనస్వి. మానసం కలవాడు. మళ్ళీవస్తాడా? అది వేరే సంగతి). కాని, ఈ ఉత్తమ దాత, అర్థికి ఆ ధైర్యం కలిగిస్తాడు. ఇలాంటి ధన్యులు కొందరుండబట్టే ప్రపంచానికి ఇంకా ప్రళయం రాలేదు.

ఇచ్చివేడిన అర్థి కిచ్చు చిత్తమేకాని.
మునుపింత ఇచ్చితి ననుట లేదు.

అని చెప్పిన మహానుభావు లున్నారు. ఇచ్చిన ఉత్తర క్షణంలోనే ఇచ్చా మన్నమాట మరచిపోతారు.

మరొక జాతి దాతలున్నారు. వీరు అడిగించుకుంటారు. అర్థింపించు కుంటారు అందరిలో ఒకరు తన్ను అడగడం, తాను ఇవ్వడం ప్రకటన కావాలి తన ఆధిక్యం ప్రదర్శించుతా నన్న ఉబలాటమేకాని, అవతలి అభాగ్యుడు, ఎంత నీరయిపోతాడో ఈ దాతకు అక్కరలేదు. అతడు యాచించాడు అని ప్రజలు అనుకుంటారన్న ఆలోచన ఈ దాతకుండదు. తానిచ్చానన్న సంగతే చెప్పుకుంటారని అనుకుంటాడు.

ఇంకొక చిత్రం. అడగవచ్చిన వాడిని ఈ దాతే నోరారా పొగుడుతాడు. మీరు చాలా గొప్పవారండీ అంటాడు; మంచివారండీ అంటాడు; మహా విద్వాంసులండీ అంటాడు. ఎందుకో తెలుసునా ? ఆ విద్వాంసుడిని, ఆ అభాగ్యుడిని మెచ్చుకోవాలని కాదు, అటువంటి వాడికి సహాయం చేశాడని దాతను చెప్పుకోడానికి. ఆ ప్రశంస అంతా తన ఎడ్వర్ టైజ్ మెంటు కోసం. ఏమయితే నేమి? ఇంతో అంతో ఇస్తాడు. అడిగినవాడి ఆపదను ఒక విధంగా కాస్తాడు. ధన్యుడే.

"రేపురా మాపురా" దాత లున్నారు. "లేదుపో" దాత లున్నారు. వీరిద్దరినీ పాపులే అన్నారు పెద్దలు. లేమి అని చెప్పిన దాతనోరు మారణ యంత్ర మన్నారు. రేపు రా మాపు రా వారిని.

లజ్జ సంకటపడజేసి అర్థి కడు
గారియ పెట్టిన పాతకింబు, అ
క్కట తొలగంగ జాలు నొకొ
కాలవిలంబము నాచరించి, పి
మ్మట తదభీప్సితార్థము
సమర్పణ చేయు ప్రదాత యెమ్మెయిన్ ;

అని. ఇదీ పాతకమే అన్నారు. కాబట్టి ఇద్దరూ పాపులే. వీరిద్దరిలో ఎవరు ఎక్కువ పాపులో నిర్ణయించడం కష్టం. ఇద్దరూ ఘాతకులే. కాని, లేదన్న వాడికి గుండు దెబ్బ. రారున తెండమో తేలదమో ఒకటి జరుగుతుంది. రేపు రా, మాపు రా దాతది అడకాదు. కుక్కచావు. రేపు మాపు దాతలంతా రూపుమాపు దాతలు. అడిగినవాడి రూపే మాపరు. యావద్దేశం రూపూ మాపుతారు. అడగలేక అడగలేక అడిగే వాడికి అడగడం అభ్యాసం చేస్తారు. ఒక్క కాసుకోసం పెక్కుసార్లు అడిగిస్తారు. మనిషిలోఉన్న సున్నితమైన గుణాలను మాటి మాటికి చంపుకునేటట్టు చేస్తారు. యాచనలో ఉన్న దైన్యాన్ని అనేకసార్లు అనుభవించేటట్టు చేస్తారు మనిషిని పశువుగా తయారు చేస్తారు ఉత్తముకిని వృత్తి బికారి వాడిగా చేస్తారు. పండితుడిని బిచ్చగాడిని చేస్తారు. దేశం రూపు మాపినవారు కారూ ?

ఈలోగా ఆ అభాగ్యుడి గతి ఏమిటి? ఆ కుటుంబం అవస్థ ఎలా వుంటుంది? ఒక్క క్షణమయినా వుండడానికి వీలులేనప్పుడు గదా అతడు అడగడానికి బయలుదేరాడు? అలాంటివాడు రేపుగాని మాపుగాని రావడానికి అవకాశం ఉందా ? ఎంత ? ఈ ఆలోచనలు మీకుంటాయి. మాకుంటాయి. కాని, ఆ దుర్మార్గుడు దాతకు వుండవు. నాలుగుసార్లు తప్పించుకోవడం ఒక నాగరికత; పదిసార్లు అడిగించుకోవడం ఒక పెద్దతనం. ఈ దాతల ముఖాలు చూచుకుంటూ వుండేటట్టు ఆ అభాగ్యుడిని చేయడం ఒక ఘనత. పదిమంది కనిపెట్టుకుని వుంటాడు అని అంటే అది ఒక పెద్ద ప్రశంసలాగా కనిపిస్తుంది ఈ దాతకు.

ఇలాంటివారి దగ్గర పడికాపులు కాస్తూ కూర్చుండిన వారిని చూచే ఒక మహానుభావుడు మనసు నొచ్చి ఇలా అన్నాడు :

"ఎందుకో వీరంతా ఈ ఖలుల;ఈ దుర్మార్గుల ముఖాలు చూచుకుంటూ ఇలా బాధపడుతున్నారు ?" అని అడిగాడు. అంటే ఇలాంటి నికృష్టపు బ్రతుకు బ్రతకడానికన్నా అడవులలో ఆకూ అలమూ, తిని బతకడం మంచిదని సూచించాడు. అక్కడికే పొమ్మన్నాడు అంతేకాదు అక్కడ మరొక్క సుకృత ముందట.

ధనగర్వంతో నోటికి వచ్చినట్లల్లా మాట్లాడుతూ వుండే రాజుల పేరయినా చెప్పేవాడెవ్వడూ వుండడట.

నామాపి న శ్రూయతే

అభిప్రాయానికి సంతోషించ వలసిందే. కాని, దాన్ని ఆచరణలో పెట్టడం అంత సులభం కాదు. ఇప్పుడు మనకున్న అడవులలో నయినా, అంత స్వేచ్ఛ వుందో లేదో చెప్పలేము.

ధనికుల హజరాలలోనూ, దాతల గుమ్మముల్ల దగ్గరా కనిపెట్టుకొని వుండిన మనుష్యులను చూచి మహానుభవంగల ఒక మనిషి, ఎందుకొచ్చిన ఆవేదన ? ఇదంతా మానుకొని,

కంథా కంచుకితాః ప్రసిశ్య
భవని ద్వారాణి వారణాసీ
రధ్యా పంక్తిషు పాణిపాత్ర పతితం
భిక్షా మపేక్షా మహే.

దుస్తులగోల ఏమీ అక్కరలేకుండా బొంత కప్పుకుంటాడట. కాశీ నగర వీధులు ప్రవేశిస్తాడట. ఆ యిల్లూ ఈ యిల్లూ ఎక్కుతాడట. వారు ఎవరయినా ఇంత అన్నం పెడితే, పట్టడానికి బొచ్చె ఏమయినావుందా ? లేదు. పాణి పాత్రం ఒక్కటే; చేతులుపట్టి దోసిటిలో పుచ్చుకుంటాడట. అలా బతుకుతాడట.

అంత విసుగు కలిగించిన వాడెవడు ? ఈ దుర్మార్గ దాత. ఈ రేవు రా మాపు రా గాడు.

ఆనాటి ఆ మహానుభావుడికి కాశీనగరం వుపయోగించిందేమో కాని, నేడు ఆ అదృష్టంలేదే. ఈనాడు అక్కడకూడా "అన్నమో రామచంద్రా!" అంటూ అటమటిస్తున్నవారు ఎందరో వున్నారు. సత్రాలు లేకపోలేదు. సంస్థలు లేకపోలేదు లక్షలఖర్చు తగ్గలేదు. కాని, నిరుపేదకూ, అల్పజాతికీ ఇప్పుడక్కడ దిక్కులేదు. ధర్మ సంస్థలన్నీ దాన సంస్థ లయిపోయాయి. జాతి ముఖ్యమయింది. నీతి సన్నగిల్లి పోయింది. కాలుతూవున్న పొట్టకు పిడికెడన్నం దొరకదు. వేళ్ళాడించుకొని తింటూ వుండేవారికి బహుళ సంతర్పణలు, భూరి సంభావనలు.

# వీరు ఒకప్పుడు మనుష్యులే!

ఒక ధనికుడి ఇంటిముందు వాలి సుగ్రీవ యుద్ధం జరుగుతూఉంది. ఇద్దరు మనుషులు రక్కుకుంటున్నారు. కరచు కుంటున్నారు. జుట్టుపట్టి ఈడ్చుకుంటున్నారు. ముఖాలపైని ఉమ్ముకుంటున్నారు. తిట్లు వర్షంలాగా కురుస్తూనే ఉన్నాయి.

ఈ ఇద్దరూ చినిగిన గుడ్డలవారే చేత బొచ్చెలవారే. ఇద్దరూ బిచ్చ మెత్తుకోడానికి వచ్చినవారే. ఆ ఇంట ఇంకా బిచ్చం దొరకనెయినాలేదు. ఇంటిలోని వారి కమ్మల చెవులకు వీరి ఆక్రందనం వినిపించనయినాలేదు. అయినా "నేనున్న చోటికి నీవెందుకు వచ్చావు?" అని చావగొట్టుకుంటు న్నారు. వీరిలో ఎవరికయినా పిడికెడు బియ్యం చిక్కునో చిక్కవో తెలియదు; ఇద్దరినీ "పో పొండి అరవకుండా" అని బహూకరిస్తారో ఏమో తేలలేదు, అప్పుడే ఈ సంగ్రామం ఆరంభమయింది. ఎందరు "ఛీ" అన్నా, వారు యుద్ధం విడిచిపెట్టలేదు.

ఇది కలకాదు, కల్పన కాదు—— అట్లా అయి ఉంటే చాలా దాగుం డును——మేము (నా స్నేహితుడు, నేను) కళ్ళారా చూచినది. కొంత సేపు నిలిచి చూచాము. నా స్నేహితుడు "వట్టి పశువులు! రా రా" అని నన్ను అక్కడనుంచి ఈడ్చుకొని పోయాడు పశువులు!.... పశువులు!....

మరొకచోట——రెండు కుక్కలు; గుర్రు పెడుతున్నాయి, పళ్ళు చూపించుకుంటున్నాయి. కుమ్ములాడుతున్నాయి. హోరా హోరిగ పోట్లాడు తున్నాయి. కర్రలతో అదలించినా మానవు. బండ్లు మోటార్లు పైని పడు తున్నా కదలవు.

ఈ పోరాటానికి కారణం ఒక్క ఎముకముక్క. దానిలో మూలుగు లేదు. మాంసంలేదు. వట్టి గొట్టమువలె ఉంది. తినవలసినది దానిలో చిన్నమంతయినాలేదు. ఎముక మింగదగినది కాదుకదా ! అయినా, దాని కోసం ఇంత ఘోరమైన కొట్లాట !

నా స్నేహితుడేమీ అనలేదు. ఇద్దరమూ నడుచుకు పోయాము. ఇవి పశువులు—జంతువులు—కాబట్టే నా స్నేహితుడేమీ అనలేదని నాకు తెలుసును. వారు మనుష్యులు కాబట్టి ఆ బిచ్చగాండ్రను గురించి అలా అన్నాడు. అక్కడ మనుష్యులు పశువు లయిపోయారు కాబట్టి విద్దూరం. అందుచేతనే ఆ అభిప్రాయం ప్రకటనం.

ఆ మనుష్యులు జంతువు లయ్యారు. కాదు. జంతువులకంటే నీచు లయారు. కుక్కల కొట్లాటకు ఎముకముక్క కారణమయినా వుంది. దానిలో తినవలసింది ఏదీ లేకపోతేనేమి ? తెల్లని ఎముక అంటూ ఒకటి ఉంది. అక్కడ అదీ లేదు. ఇంకా ఆ ఇంటివారు కనబడలేదు. నిండుపిడికిలో, వట్టి పిడికిలో తెలియదు. ఇద్దరికీ దొరుకునో ఒక్కరికే దొరుకునో తేల లేదు. అయినా అంత కొట్లాట ! అంత రక్తపాతం ! ఆ కుక్కలకంటే నీచమని అనాలా ? వద్దా ? నిజంగా జంతువులే; కాదా, ధయ్యాలు అనాలి.

కాని, దయాదాక్షిణ్యం ఆ హృదయాలలో ఒకప్పుడు ఉన్నదే. ఇతరులయందు సహనం, మానవ సోదరులయందు సహకార భావం ఇలాంటి గుణాలు వారికి కొత్తవికావు, ఒకప్పుడు. మానవులు అంటే గౌరవభావం వారికి ఒకప్పుడు లేక పోలేదు. వారూ ఒకప్పుడు మనుష్యులే, మా సోదరుడు మాక్సిం గోర్కీ అన్నట్టు.

ఇప్పుడు వారిలో - ఆ గుణాలన్నీ నశించిపోయాయి. మనుష్యులు అంటే పరమ దుర్మార్గులనీ, మహా చండాలులనీ వారి హృదయాలలో అచ్చు పడిఉంది. మనుష్యులంటే నరమాంస భక్షకు లని వారి దృఢ విశ్వాసం. ఎలాంటి, నరమాంస భక్షకులో తెలుసునా ? చచ్చిన నరులమాంసం తినేవారు కాదు,నరులు బతికి ఉండగానే వారి మాంసం ముక్కలు ముక్కలుగా

కొరికి నములుతూ, మధ మధ్య వారి రక్తంతోనే దాహం తీర్చుకుంటూ, ఆనందించే నరమాంస భక్షకులు అని వారికి రూఢి.

ఇది ఏ లోకం అని వారినడగండి – భూలోకం అని చెప్పరు – చెప్పలేరు. భూత పిశాచాల లోకం అంటారు. నరలోకం వేరే ఒకటి ఉందంటే. అదంతా అజ్ఞానులూ, మూర్ఖులూ చెప్పుకొనే మాట అని ప్రయాణంచేసి చెప్తారు. "నరకలోకం" అని చెప్పడానికి బదులు క అన్న ఒక్క అక్షరం తొలగించి "నరలోకం" అని అన్నారంటారు. (చదుకున్న వాడెవడయినా ఉంటే కప్రత్యయం స్వార్థంలో వచ్చిందని శబ్దరూపం సాధిస్తాడు కూడాను.)

పండువంటి మనుష్యులను ఇలా పశువులుగా. పశువులకంటె పరమ నీచులుగా, చేసిన వారెవరో తెలుసునా ? చెప్పుతే నమ్ముతారో నమ్మరో, కాని, ఈ "దాతలే" రేపు రా మాపు రా అన్న ఈ దాతలే యోగ్యతను అయోగ్యతను గుర్తించకుండా అడిగినవాడిని ఆవలకు పొమ్మన్న ఈ దాతలే. పేరులకోసం ప్రాకులాడి, పౌరోహితుల ఇచ్చకాలను మెచ్చుకొని, ఒకేసారి స్వర్గానికి ఎగిరిపోవాలని తమ ధనం వ్యయంచేస్తూ, ఈ అభాగ్యులను పో పొమ్మన్న ఈ దాతలే. నిజం! ముమ్మాటికీ నిజం!

కటువుగా ఉందేమో? క్షమించాలి. కాని, కడిగి వడపోసిన సత్యం! ఏమంటారా? వీరు చేసిన ఘనకార్యం చూడండి! ఒకసారి అడగడానికే, అంత యమయాతనపడి, అంత ఆత్మను చంపుకొని, అడకలేక అడగలేక "దేహీ" అని అడిగినవాడిని, మరొకసారి అడిగించారు. ఇంకా ఒకసారి అడిగించారు. మరి పదిసార్లు అడిగించారు. ఒకడిని అడగడానికే అంతఘోర విషాదం పొందినవానిచేత నలుగురిని అడిగించేటట్టు చేశారు. ఇన్నిసార్లూ ఆ అభాగ్యుడు ఆత్మను చంపుకోక తప్పిందికాదు. ఇన్నిసార్లూ అతనికి యమయాతన అంతా అభ్యాసం చేసుకోక తప్పిందికాదు. మానసం ఇన్నిసార్లు చిదుగక తీరలేదు. ఆ నిర్భాగ్యుడిలో ఉన్న మంచి గుణాలు, సున్నితమయిన విషయాలు, అన్నీ ఇన్నిసార్లూ అంతరించకుండా ఉండటానికి వీలు లేకుండా చేశారు. ఈ దాతలే.

## అడుక్కుతినేవాళ్ళ మహాసభ

పవిత్రమయిన మానవగుణాలను పాడుచేసినవారు ఈ "ఇప్పుడులే" అన్న దాతలున్నూ. "రేపురా మాపురా" అన్న దాతలున్నూ. అడగకుండానే చెయ్యవలసిన ధర్మం అడుగున పడవేశారు. అడిగిన తరువాతను గూడా ఈ అగచాట్లకు పోయారు. సోదర మానవుడిని ఈ అవస్థలకు దించారు; ఈ దాతల పుణ్యాన్ని అడగడంలో ఉన్న కాటు దుర్బలం అయింది. పరిపాటిమొదట కుట్టినంత బలంగా రెండోసారి కుడుతుందా ఎంతటి తేలయినా ? అలాంటిది పదిసార్లు అడగగా, అడగగా, అదీ ఒక అయిపోయింది, చురకదు, కుట్టదు, బాధించదు. సున్నితమయిన సుగుణాలు శూన్యం అవుతాయి. హృదయం ఒక బండరాయి అవుతుంది. ఇతను ఆదౌర్భాగ్యుడు; ఆ అడిగినవాడు.—మనుష్యుడు కాక, పశువు అవుతాడంటే దోషమా?

అలాంటి వాడికి మానవులంటే, ఎటువంటి అభిప్రాయాలుంటాయి? ఎంత గౌరవం నిలుస్తుంది ? వారంతా పశువులనీ, వట్టి దౌర్భాగ్యులనీ, పరమ చండాలులనీ అనుకుంటే తప్పా ? తానూవారితో కలిసి ఒక పశువు ఒక జంతువు, ఒక క్రూరమృగం అయిపోతే నేరమా? సృష్టికంతటికీ దాని వల్ల ఒక విప్లవం కలిగిందంటే దోషమా? భగవంతుడి సృష్టిని ఈ పాడు దాతలు ఇలాగా తారుమారు చేశారు అంటే ఆక్షేపణ ఉంటుందా? వారిని మా స్నేహితుడు "పశువులు" అని అన్నాడంటే ఆశ్చర్యమా ?

అందుకే కదా అన్నారు మహానుభావులు—ఈ దాత ఒక్కడే భూదేవికి భారం అని; ఈ మహారణ్యాలూ, ఈ కులపర్వతాలూ, ఈ గంభీర సముద్రాలూ భారంగా ఉండవు. ఈ

యాచమానజనమానస
వృత్త్యభి పూర్తి బుద్ధియై
వ్వానికి లే దొకింతయును
వా డొకరుండె భరంబు ధాత్రికిన్.

కాలవిలంబముచేసి, పదిసార్లు సిగ్గుపడేటట్లుచేసి, ఎప్పుడో పిమ్మట ఏదో సమర్పణ చేసిన దాత.

ఆ లి ం డి యా

పాతకంబు నక్కట తొలగంగజాలు
నొకొ....ప్రదాత యెమ్మెయిన్.

అని అన్నారు సత్యం !

ధర్మానికి దానం అన్నపేరు పెట్టిన భూలోకబ్రహ్మలు అడుగుకొనే వాడిని సృష్టి చేశారు. అడుగుకొనే వాడిని అదవిమృగాలుగా చేసినవారు ఈ మహాదాతలు. వీళ్ళలో ఎవరిని ఎక్కువగా గౌరవించాలో నిర్ణయించడం కష్టం. వారు బ్రహ్మలయితే వీరు సృష్టికి ప్రతి సృష్టి చేసిన విశ్వామిత్రులు. వీరిద్దరికీ చేయెత్తి జోహారు చేయడమే మహోత్తమం.

# అడగటం నేర్చారు

ఎవరి ధర్మం—చేయవలసిన—పని వారు చేసినట్టయితే, ఒకడు అడగడం ఇంకొకడు ఇవ్వడం అన్న సంగతులు కలగడానికే అవకాశం లేదు. అయినా ఈ విపర్యాసం మనకు వచ్చింది. ఈ విపరీతం ప్రకృతిలో లేదు ప్రపంచంలో లేదు. మానవులలో పూర్వం లేదు. లేనివాడు లేనేలేడు. జంతుకోటిలో "లేనిది" అంటూ ఒకటుందా? పురుగులలో వుందా? పులుగులలో వుందా? అడుగుకుంటూ జీవనం చేయడం అన్నది ఎక్కడా సృష్టిలో లేదు. మనుష్యులలో మాత్రం ప్రవేశించింది. ప్రపంచ సౌంద ర్యాన్ని ఒక్క_క్షణంలో పరిమార్చివేసింది. దీనికి కారణం మన మత గురువులు_ఈ దేశంలోనే కాదు; ప్రాక్ పశ్చిమ దేశాలన్నిటిలోనూ ఇదే, ఈ క్రీస్తువర్గమే—అని మనవి చేశాను. ఈ క్రీస్తులు గుళ్ళో ఉన్న దేవుడికి ఊళ్ళో ఉన్న మనుషులకూ మధ్య పోస్టాఫీసుగా తయారవుతారు. ధర్మం అన్న దానిని దానంగా చేశారు. పరలోక సౌఖ్యం అని పేరు పెట్టారు. దానిని పారితోషికాలకు అమ్మడం ఆరంభించారు. పురోహితులకు దానం చేస్తే చాలును. పరమ పాపాత్ముడయినా, సరాసరిని, పుణ్యలోకానికి పోతా డన్నారు. పుచ్చుకున్నదంతా కృష్ణార్పణం అని అటువైపు చేయిడాపారు. అందరినీ సంతోష పెట్టవలసిన బుద్ధిని, ఆత్మసౌఖ్యం కోసం వినియోగించారు. భూలోక బ్రహ్మలయి, అడగడం, అడిగేవాడు అన్న విషయాలను సృష్టిచేశారు అగ్రహారాలు, పుచ్చుకొని ఆనందం అనుభవిస్తున్నారు. సృష్టిలో ఉన్న మూలసూత్రాన్ని తారుమారు చేసి తలకిందులు చేశారు

ఆ బ్రహ్మలకు ప్రతి బ్రహ్మలు — దుర్గర్వ దూషితులు; అధునాతన విశ్వామిత్రులలాగా, ఈ దాతలు ప్రవర్తించారు. మంచి చెడ్డలను

గ్రహించడానికి తగినంత తెలివిలేదు. మానవ హృదయాన్ని అవగాహన చేసుకోగలిగిన ఔదార్యంలేదు. ధనం ఉంది గాని గుణం లేదు దీనివల్ల మర్యాదలకు అర్హులుగా ఉండవలసిన మనుష్యులు లజ్జ విడిచి ఆత్మను చంపుకొని, అడిగి లేదని అనిపించుకోవలసి వచ్చింది రేపురా మాపురా లతో రూపు మాసిపోవలసి వచ్చింది. ఆత్మహత్యలకు అవకాశాలు కలిగాయి అఖిల మానవలోకాన్ని అసహ్యించుకోవలసి వచ్చింది. జంతువులలాగా, పశువుల లాగా కావలసి వచ్చింది. ప్రపంచం పాడయింది.

దుర్మార్గులూ, దుష్టులూ, ధనికుల హజారాలలోనికి స్వేచ్ఛగాపోతూ వుంటే, సజ్జనులూ, సాధులూ వెలుపల పడరాని పాట్లుపడుతూ ఉన్నారు దీనినంతా చూచే ఒక మహానుభావుడు ఆశ్చర్యపోయాడు; అసహ్యించుకున్నాడన్నమాట.

ఇల కందంబులు మూలముల్
మడిసెనో; యేళ్ళింకెనో కొండలన్ ;
ఫలముల్ నారలు వృక్షశాఖల యెడన్
పాడయ్యెనో చూడ ; గే
వల దుఃఖాప్తమితార్థ గర్వపవన
వ్యాన్తరితభ్రూలస
త్ఖల భూపాస్యము లర్థి జూచెదరు
భ్రాంతస్వాంతులై యాచకుల్.

"ఎందుకురా వీరంతా ఇలా కనిపెట్టుకొని ఉంటున్నారు? కొండల మీదను, అడవులలోనూ కందమూలాలు పుట్టకుండా ప్రళయం ఏమయినా వచ్చిందా? సెలయేళ్ళన్నీ ఇంకిపోయాయా? చెట్లు, పండ్లు కాయకుండా నశించిపోయాయా? ఈ ఖలుల ద్వారాల దగ్గర పడికాపులు కాచుకుంటూ, వారి అనుగ్రహంకోసం ఎందుకిలా తాపత్రయ పడుతున్నారు? పొట్టపోసుకోడానికి చాలినంత తిండికి ఇంత అవమానాన్ని పొందాలా? ఆకులతోనో, నారలతోనో శరీరాన్ని కప్పుకోలేరా?" అని ఆవేశంతో అన్నాడు.

"ఖలులు" అన్నాడు. అంటే. దుర్మార్గులు అని. కాని వీరు వట్టి దుర్మార్గులే అయితే. వారంతా ద్వారాలదగ్గర ఎందుకుంటారు ? వీరు దాత అన్న ప్రసిద్ధి ఉండబట్టే ఇక్కడకు వచ్చారు. లేకుంటే వస్తారా ? కాబట్టి పేరును పట్టి చూస్తే వీరు దాతలు, తిరుగుబట్టి చూస్తే ఖలులు–దుర్మార్గులు దాతలందరూ అని ఈ మహాను భావు డనడు. కొందరు మంచివారున్నారు.

దానవిద్యా పరితంత్ర మానసులు

ఉన్నారు. కాని, ఈ ఖలులు ఎక్కువ సంఖ్యవారు. వీరయినను ఎటువంటి వారు? ఆ మహామహుండే చెప్పాలి.

"ఒకడిన్ని పాడుచేశో, ఇంకొకడి నోరుకొట్టో, మరొకడిన్ని మోసం చేశో, చేయవగిన పనులు చెయ్యకుండా, చేయరాని పనులుచేసి, ఇంతధనం సంపాదిస్తారు వీరి ఆర్జన అంతా అన్యాయార్జితం, నీచకార్య భరితం, పాపభూయిష్టం, దుఃఖోపాత్తం అని కవి అంటాడు. ఆ రవం. ధనం సంపాదించేసరికి గర్వం కళ్ళకెక్కుతుంది. ఒళ్ళు మరచిపోతారు. తల తిరిగిపోతుంది. అంతకుముందు ఏమయినా మర్యాదా. వినయమూ. ఇలాంటి గుణాలుంటే అవన్నీ పారిపోతాయి. గర్వం గాలిలాగా శరీరాన్నంతటినీ పూరించేస్తుంది. ఆ గర్వ పవనంతో బొమలు ఎగురవేస్తుంటారు. ఆ బొమల ఆటతో అనుగ్రహ ఆగ్రహాలను ప్రదర్శిస్తుంటారు. నోరార చెప్పడానికి గూడా బద్ధకం–గర్వం.

అపగతప్రశ్రయాణాం ఖలానాం
దుఃఖోపాత్త - అల్ప విత్తస్మయ
పవనవశాన రిత భ్రూలతాని

అటువంటి "దాత"లను ఖలులు అంటే తప్పా ? అనని వారుంటారా ?

తన దగ్గర ధనం అంతా తన న్యాయార్జనే అనుకుంటారు దానిరు సేకరించడానికి ఎన్ని కొంపలను కూల్చారో వారు స్మరణకు తెచ్చుకోళ్ళ ఎందరు అమాయకులను మోసపుచ్చారో మరచిపోతారు. వీరి ధనాశకు.

ఎందరు అభాగ్యులు బలి అయిపోయారో తెలియదు. ఎన్ని జీవనాలు నశిం చాయో, ఎందరు సోదర మానవులు నిత్య మృత్యువులో నలిగిపోతున్నారో వీరికక్కరలేదు. ఆ ధనం తనదనీ, తానొక ఇచ్చేవాడనీ, కాబట్టి, లేదంటే పోవాలనీ, మళ్ళీ రమ్మంటే రావాలనీ . వీరి అభిప్రాయం.

అదే కవి చెప్పిన గర్వపవనం. దానితో బొమలెగర వేస్తారు; గుడ్లు మిటకరిస్తారు. ప్రపంచం అంతా తన బొమలే చూస్తున్న దనుకుంటారు. మరింత గొప్పవార మవుతున్నామని భావిస్తారు ఇతరులు ఎంత దీనంగా ఉంటే తన గొప్పతనం అంత రాణిస్తుం దనుకుంటారు. ఎన్నిసార్లు తిప్పుతే; అంత గొప్పనుకుంటారు. ఎంత పెద్ద వాడిని పొమ్మంటే అంత గౌరవం అనుకుంటారు.

వీరిని ఖలులు అంటే చాలునా? దుర్మార్గులంటే తీరునా? ఇంతకన్నా గట్టిమాట భాషలో లేదా ? లేకపోతే అది ఆ భాషా దురదృష్టం; ఈ దేశ దౌర్భాగ్యం. నిజం చెప్పాలంటే ఈ దుష్ట దాతలను ఖలులు అనడం భయంకర విషజ్వాలలు కక్కుతూ వస్తున్న క్రూరసర్పాన్ని పురుగు అన్న ట్టుంటుంది.

ఆహా! ఎంతటిది ఎంతకు వచ్చింది. అడిగి బ్రతకవలసిన అవసరం లేకుండా ఉండే ప్రపంచంలో అడగడం అన్న పని ఒకటి సృష్టించారు. అందరూ సుఖంగా జీవిస్తూ ఉండవలసిన లోకంలో కొందరిని అడగకపోతే గతిలేనట్టి అవస్థకు తెచ్చారు. ధన గర్వాంధులైన దుష్టదాతలు ఇప్పుడు ఈ పాపానికి ఒడిగట్టారు.

షేక్స్పియర్ మహాకవి చెప్పినట్టు—

మొదట ఏలాగా అడుక్కోవడమో నేర్పారు;
తరువాత అడుక్కొనేవాడిని ఎన్ని అవస్థలు
పెట్టాలో చూపుతున్నారు.

ఈ సందర్భంలో ఒక "అడగజాలనివాడి" మాటలు జ్ఞాపకం వస్తు న్నాయి. ఈ అడగలేనివాడు మరెవ్వరో కాదు; బమ్మెర పోతనా మాత్యుడు

—భాగవత కవి. ధనికులయిన దాతల ద్వారాల దగ్గరకు కాచుకుంటూ ఉండేవాళ్ళను గురించి ఇలా అన్నాడు ఈ మహానుభావుడు;

కమనీయ భూమిభాగములు లేకున్నవే
    పడి యుండుటకు దూది పరుపు లేల ?
సహజంబు లగు కరాంజలులు లేకున్నవే
    భోజన భాజన పుంజ మేల ?
వల్కలాజినకుశావళులు లేకున్నవే
    కట దుకూలసంఘంబు లేల ?
కొనగొని వసియింప గుహలు లేకున్నవే
    ప్రాసాదసౌధాది పటల మేల ?

ఫలరసాదుల గురియవే పాదపములు ?
స్వాదుజలముల నుండవే సకల నదులు ?
పొసగ భిక్షము పెట్టరే పుణ్యసతులు ?
ధన మదాంధుల కొలువేల (మనుజులకును).

# పట్టి మోసపు మాట

పట్టు పీతాంబరాలకోసం అడిగితే అడగనీయండి; పెట్టే బేడలకోసం అడుగుతే అడగనీయండి. అంతేగాని పొట్ట పోసుకోడానికి మాత్రం అడగ నీయరాదు. చేయీ, కాలూ ఆడినవారు ఎవరయినా సరే, పూట తిండి కోసం ఒకరిని యాచించరాదు. అలా జరిగినట్టయితే అక్రమం, అన్యాయం, అధర్మం.

సృష్టిలో ఏ జంతువూ తన తిండికోసం ఇంకొక జంతువును అడగదు కొంతవయసు తరవాత. అలా అడగరాదనే, సృష్టిలోని రహస్యం. కాని, మనుష్యులు పొట్టపోసుకోడానికి అడుక్కుంటున్నారు. ఇది ఆ సృష్టియేనా? కాదు; కానేరదు. విపరీతసృష్టి. ఇదీ సృష్టే అంటే దేవుడికి మతిపోయి అయినా ఉండాలి. లేదా; మనుష్యులు దేవుడిని పెద్ద దయ్యంగా చేసి అయినా ఉండాలి.

అంతా ఒక కుటుంబం అంటారు. మానవ భ్రాతృత్వం అంటారు. కాని, కాలిన పొట్టలకోసం దేహీ అని అడిగేటట్టు చేస్తుంటారు. ఆత్మను చంపుకోమంటారు. యమయాతన పొందమంటారు. మరణవేదన అంతా పడమంటారు. పంచతంత్రంలో చెప్పినట్టు అడిగేవాడి అవస్థ,

చరణములు వడకు
పరవశమౌ నొడలు. రాలుపడు నెలు గాహా
మరణమున నెట్టి చిహ్నము
లరయన్ యాచకుడు దాల్చు నా చిహ్నములన్.

ఇదీ ఒక కుటుంబమేనా ? ఇటువంటి కుటుంబం ఎక్కడయినా ఉంటుందా? కుటుంబం అంతటిలోనూ ఒక్కడు-ఒక్కడే సుమండి, పదులు కారు, వేలు

కారు, కోట్లు కారు-ఒక్కడు, తిండిలేక తపిస్తూ ఉంటే, ఆ కుటుంబం పరువు ఏమయినా ఉంటుందా? ఆ ఒక్కడి కడుపు చిచ్చు ప్రళయాగ్నిలాగా రగిలి, ఆ కుటుంబ గౌరవాన్నంతటినీ ఒక్కసారి భస్మీభూతం చేసివేయదూ? ఇప్పుడు ఈ మానవ కుటుంబంలో ఎందరు, ఎన్ని లక్షలు, ఎన్నికోట్లు, అన్నమో రామచంద్రా అని అలమటించి పోతున్నారు! ఎందరు కేవలం ఆకలి మంటలకు, దిక్కులేక ఆహుతి అయిపోతున్నారు! ఎన్ని సుందర జీవాలు నిరర్థకాలయిపోతున్నాయి! ఇంకా ఇది కుటుంబం అన్నవాడు-మూర్ఖుడుకాక మరెవ్వడు-అసత్యవాది. జ్ఞానహీనుడు. మోసగాడు.లేదా పిచ్చివాడు. అంతేగాని ప్రపంచజ్ఞాన మున్నవాడు కానేరడు. మానవ అంటే పిశాచ అని అర్థముంటే, దీనిని మానవ కుటుంబం అనవచ్చును. కాక కుటుంబం అంటే పల్లకాదని అర్థం ఎవరయినా చెప్పతేగూడ, దీనిని మానవ కుటుంబం అనవచ్చును. అంతేగాని, ఈ మాటలకు ఎప్పటి అర్థాలే ఉంటే మాత్రం, ఇకను ఎవ్వరూ దానిని కుటుంబం అనరాదు. కనకన మండుతూ ఉన్న కడుపు నింపుకోడానికి చేయిచాచి, నోరువిడిచి అడగవలసిన అవసరం ఉన్నంత కాలమూ ఇది కుటుంబం కానేరదు. అలాంటి వాళ్ళు లక్షలూ, కోట్లూ ఉన్నారు.

ఉన్నారేమిటి? వారినలా సృష్టి చేశాము. అడగండి, మీ ఇష్టంవచ్చిన ముష్టివాడిని—వాడలా ఎందుకు అడుక్కుంటున్నాదో—తెలుస్తుంది. అది తన లోపమో, మన లోపమో! ఇంకా, కుటుంబమా? వశనిపరమా!

సంఘం అంటారా? పాపం శమించాలి. ఏ సంఘంలో ఉంది ఈ విపర్యాసం? సభ్యులలో ఇంత వ్యత్యాసం కనబడే సంఘం ఏదయినా ఉందా? ఉంటే దానినిగూడా సంఘం అంటామా? సబబూ సందర్భమూ లేని సంత అంటామా?సంఘం! దబ్బర! దోపిడీ హింస, మానవభక్షణం. మరేమీకాదు.

అడిగేవాడు ఒక్కడు ఉన్నాడు అంటే—మానవలోకానికి ఇంత అపఖ్యాతి కలుగుతుంది. అది సృష్టి కాదు. కుటుంబం అనడం అంతా వట్టి మోసం. సంఘం అన్నది పెద్ద దబ్బర అలాంటివాడు ఉండినట్టు చేయడం గాని, ఉండడాన్ని అంగీకరించడం గాని ఏమిటో తెలుసునా? దేవుడి శిరసును

కాలితో తన్నడం అన్నమాట కటువుగా చెప్పానని కోపగించకండి నిజం అంతే. పుట్టించినవాడు పోషించాలి. పోషించడానికి అంతా చేశాడు. అన్నీ ఇచ్చాడు. అయినా, ఆ పోషణ జరగనీయకుండా తక్కిన వాళ్ళు అడ్డు వచ్చారు. వీరి ధర్మాన్ని ఆ భగవంతుడు బండరాయిగా అయాడు. ఇంత కంటే మరేదయినా అర్థం ఉందా? ఇంతకన్నా దేవుడ్ని అవమానించవచ్చునా?

ఇదంతా కర్మ అనడం కళ్ళలో దుమ్ము—కాక కారప్పొడా?— చల్లడం: చేసిన దుర్మార్గానికి మారుపేరు పెట్టడం. లోపలున్న కుళ్ళుకి మెరుగుపూత పూయడం. కర్మ ! ధర్మానికి పీడుకోలిచ్చారు; దానం అన్న పేరుపెట్టి ప్రపంచం నోళ్ళు కట్టారు. ఆకలిమంటలు అలుముకున్నట్టు చేశారు. ఏమయ్యా ఈ అధర్మం అంటే, ఇదంతా ఖర్మ అన్నారు. ఇందులోని మర్మం మరేదీ కాదు.

ఒక మనిషి ఇంకొక మనిషిని ఆకలికోసం అడుగుకోవడం అసంభవంగా కనిపించకపోదు. అది అసహజం. కడుపు నింపుకోవడానికి కక్కుర్తి పడవలసిన దారిద్ర్యం సృష్టిలో ఎక్కడా లేదు జీవనాధారమయిన ఆహారానికి అడ్డు ఉండరాదు. భోజ్యాలూ, రుచులూ లేకపోతే మానె, బొందెలో ప్రాణాలు నిలుపుకోడానికి తగిన ఆహారం స్వేచ్ఛా లభ్యంగా వుండాలి. అంటే, తినడానికి ఇష్టం వుంటే మరేదీ అభ్యంతరము ఉండ కూడదు.

అంతేకాదు, ఇలాంటి ఆహారం అదైన్యంగా వుండాలి. అంటే దాని సంపాదించుకోడానికి ఎలాంటి దీనత్వమూ పొందవలసిన అవసరముండ రాదు. ఎంత కష్టం అయినా పడవచ్చును; కాని దీనత్వము పడరాదు.

ఈ సూత్రాలు మనసులో వుంచుకొనే, బుద్ధిమంతులు "ఈ పాడు ప్రపంచం విడిచిపెట్టి అడవులకు పోరాదా? కందమూలఫలాలు లేవా? సెల యేళ్ళలో నీళ్ళు ఇంకిపోయాయా?" అని హెచ్చరించారు మెచ్చనూర్చారు. వారు అలా అనడం అడవులమీద ప్రేమవల్లకాదు; లోకంలో వున్న విపర్యాసాలమీద విసుగుపుట్టడం వల్లనే. నిజం. ఇక్కడగూడా "స్వేచ్ఛా లభ్యం, అదైన్యం" అయిన ఆహారయోగ్యతే వున్నట్టయితే, అడవులకు

ఎందుకు పొమ్మంటారు? బుద్ధిమంతులు కాబట్టి ఈ దుర్గర్వ దుర్విదగ్ధుల పోకిళ్ళు అన్నీచూచి, ఈ ఉపదేశం చేశారు.

అంత వికృతాకారంగా చేశారు లోకాన్ని. ఆకటి చిచ్చులతోనూ. అర్రాకలితోనూ అడగ మన్నారు; అడిగించుకుంటున్నారు; ఆవరకు పొమ్మ" టున్నారు గూడాను. ధర్మంచెయ్యండి బాబూ అంటే, "ఛీ! అవలికి పోం అంటున్నారు. ఏమో అనుకుంటున్నారు. నిజం గ్రహించలేకుండా వున్నారు. ఆధిక్యత ఎలాగ వచ్చిందో ఎరగరు. అవతలవాడి అల్పత్వం ఎందుకు వచ్చిందో తెలుసుకోలేరు ఉబ్బితబ్బిబ్బు లవుతున్నారు అజ్ఞానులు.

# దొంగ ఎవడు ? దొర ఎవడు ?

భగవంతుడి సృష్టి అనండి; ప్రకృతి ఏర్పాటు అనండి; జంతువులలో లేనిది అన్న జంతువు లేదు. అన్ని జంతువులూ ఉన్నవే. అలాగే మనుష్యులలో గూడా. ఆదిమ నివాసులలో లేనివాడు లేడు. కొత్త రాతి యుగంలో లేనివాడు లేడు. ఇనుము రోజులలో అడుక్కొనేవాడు లేడు. కంచు రోజులలో అడుక్కునేవాడు లేడు.

ఈ అడిగేవాడు నాగరిక దినాలలోనే వచ్చాడు. నవనాగరికత వచ్చిన తరవాతనే ఈ దరిద్రం సంభవించింది. దీనినిబట్టే ఇది ప్రకృతి విరుద్ధమని నిర్ణయించవచ్చును. దీనినిబట్టే ఇది అస్వాభావికం అని నిర్ధారణచేయవచ్చును. నిజముగా ఈ అడుగుకోవలసిన అవసరం ప్రకృతి చేసినది కాదు; భగవంతుడు చేసినది అంతకన్నా కాదు. ఇదంతా నరుడు చేసిందే; దుర్మార్గ మానవుడు చేసిందే.

ఈ దుష్ట నరుడు ప్రకృతిని పెడత్రోవలో పెట్టాడు. అడగకుండా, స్వతంత్రుడుగా, జీవించవలసిన తోడి మానవుడిని అడిగేటట్లు చేశాడు; అడగకపోతే వేరే గతిలేకుండా చేశాడు. అడిగించాడు; అన్ని అవసరాలకూ సోదర మానవుడిని బలిచేశాడు. దాతననీ, ధర్మాత్ముడననీ నోలుస్తున్నాడు.

నేను చెప్పినమాటలు కొంచెం కటువుగానే ఉంటాయి నిజమే. కాని, అంతమాత్రంచేత అవి అసత్యమని అనుకోరాదు. ఏమంటే, చూడండి : అనాగరపు రోజులు ఎలా ఉండేవి ? కొంచెం బుద్ధిని వెనక్కి మరల్చండి. జంతువులను చంపుకొని తినేవారు— సృష్టిలోని సూత్రమే అది. ఒకడు ఒక జంతువును చంపినా పదిమంది పది జంతువులను చంపినా అందరూ ఒక్కలాగానే తినేవారు. చంపిన కీర్తి వారిది, స్వామి భోజనం అందరిదీని.

ఇప్పటికీ అనాగరక జాతులలో ఇంకా అలాంటి అభ్యాసం ఉంది. చెట్టు దులిపినా, చేపలుపట్టినా, తెచ్చిన కీర్తి ఒక్కడికి. కాని తినే అధికారం అందరికీని అనుభవంలో ఆవంతయినా వ్యత్యాసం లేదు.

మన కుటుంబాలలోనూ అంతే. తెచ్చేవాడొక్కడే అయినా ఇంటిలో ఉన్నవారంతా ఒక్కలాగానే తింటారు. ఒక్కలాగానే అనుభవిస్తారు–స్వల్ప వ్యత్యాసాలుంటే ఉంటాయిలెండి—భేదం ఏమీ ఉండదు.

న్యాయం ప్రకారం ఆలోచిస్తే, సంఘం అన్నది అలాగే ఉండాలి. సంస్థ అన్నదీ అలాగే ఉండాలి కాని ఇప్పుడలాగ లేదు. ఉన్నవాడూ, లేనివాడూ అన్నభేదం కలిగింది. కటువుగా పరిణమించింది. పరమయోగ్యు లయిన మనుష్యులను పశువులతో సమానంగా చేసింది

అటువంటి సంఘం ఈ గతికి ఎలా వచ్చి ఉంటుందో కొంచెం ఆలోచించండి. ఎప్పుడో, ఎవ్వడో ఈ అన్యాయం ఆరంభించాడు. అందరి కోసం రావలసిన ప్రతిఫలం కొందరి కోసమే అన్నాడు సర్వజనులకూ చెందవలసిన సొత్తును స్వంత సొత్తుగా భావించాడు. సుభిక్షంగా ఉండవల సిన సంఘంలో దుర్భిక్షాన్ని ప్రవేశపెట్టాడు.

ఈ ఆరంభం అలా అల్లుకుపోయింది. కూసే గాడిదను చూచి మేసే గాడిద అంటారు అలాగనే ఒకర్ని చూచి ఇంకొకడు. ఈ అన్యాయం, ఈ అధర్మం, ఈ ఘోరం వ్యాపించిపోయింది అందరూ అనుభవించవలసిన దానిని అంతా నాదే అన్నారు. ఇచ్చినప్పుడయినా, ఇవ్వవలసినంత ఇవ్వలేదు. తక్కువ ఇచ్చారు. పుచ్చుకున్నప్పుడు హెచ్చు పుచ్చుకున్నారు అవసరం కంటే అధికంగా ఆక్రమించుకున్నారు ఇచ్చేటప్పుడు పిడికలి మరింత బిగబట్టారు.

ఇది ఎలాగా జరిగిందని అడుగుతారేమో. ఏమీ విశేషం లేదు. చూడండి ; పదిమంది ఒక జట్టుగా ఒక అడవికి పోయారనుకోండి. ఒక చెట్టున బాగా పండిన పళ్ళే ఉన్నాయనండి. ఈ పదిమందిలో ఒకడు గబ గబా చెట్టు దగ్గరకుపోయి చెట్టునూపుతాడు. చెట్టునఉన్న పళ్ళన్నీ పడి పోతాయి. ఇప్పుడు ఆ మనిషి ఈ పళ్ళన్నీ నావే అంటే ?– ఏముంది ?

తక్కిన వాళ్ళంతా పస్తుండవలసిందేనా? ఆడించినంత మాత్రాన, అంత అధికారం కలుగుతుందా? అప్పుడయినా అన్ని పళ్ళు పడిన తరువాత నయినా, తాను తినవలసినన్ని పళ్ళు తాను తిని, తక్కిన వాటిని విడిచి పెట్టినా బాధలేదు. తక్కినవాళ్ళు గూడా అన్నో ఇన్నో తిని పొట్టపోసుకునే ఉందురు. కాని అలా తినలేక, ఇతరులకు విడిచి పెట్టలేక "రేపు, ఎల్లుండి పది రోజులదాకా నేను వీటినే తింటాను; మీకు ఇవ్వను" అని అన్నిటినీ మూటకడితే, ఆ మహానుభావుడు ఏమిచేసినట్లు? అవసరంకంటే అధికంగా ఆక్రమించుకున్నట్టేనా? ఇవ్వవలసినంత ఇవ్వకపోయినట్టేనా? అక్రమ మేనా? అధర్మమేనా?

ఇంతకూ తనకు ఆ పళ్ళమీదఉన్న అధికారం ఏమిటి? ఎలా వచ్చింది? ఆ పదిమందిలోనూ ముందుగా తాను పోయినందుకా లేక చెట్టు ఊపగలిగినందుకా, ఎందుకని యింత ఆగడం?

ఇదే జరిగింది ప్రపంచంలో. అక్రమంగా ఒకడు ఇతరులను మోసం చేసి, అంతా నాదే నన్నాడు వానిని చూసారు తక్కినవారు గూడా ఆ పద్ధతినే అవలంబించారు స్వలాభం చూచుకున్న వాడూ, ముష్కరుడూ, మొండివాడూ, పెద్దవాడయ్యాడు. మెత్తనివాడు లేనివాడయ్యాడు. నా అంతస్థు వేరు, మీ అంతస్థు వేరు అన్నట్లు మారిపోయాడు.

పూర్వపు నాయకుల చరిత్రలు ఒక్కసారి తిరగవెయండి. ఎంత పరాక్రమం ఉండేవాడయినా, ఎంత మహా ధీరుడైన నాయకుడయినా నలు గురితోపాటు తానూ ఆ జొన్నరొట్టే తినేవాడు; ఆ కటికనేలనే పడుకొనే వాడు. నాయకుడుగా ఉండినప్పటికీ నలుగురితో సమానంగా ఉండేవాడు. యుద్ధంలో దొరికిన వస్తువులను అందరూ అనుభవించేవారు ఏదయినా ఎక్కువ ఉంటే కత్తులకోసం, కటారులకోసం, పశువులకోసం బండ్లకోసం- అంటే సంఘానికి పనికి వచ్చినట్టు ఉపయోగించేవారు ప్రత్యేక భావం అన్నది లేదు. అంతా నాదే అన్నది అసలే లేదు

అలాగా, న్యాయప్రకారం ఇవ్వవలసినంత ఇచ్చి ధర్మ ప్రకారం పుచ్చుకోవలసినంతే పుచ్చుకొని వుంటే, ఈ విపర్యాసం మనుష్యులలో

కలుగుతుందా ? ఈ అక్రమాలు భూలోకంలో ఉంటాయా ? ఆ న్యాయం ఏనాడు అంతరించిందో ఆనాడే ప్రపంచానికి దరిద్రం దాపరించింది. ఎంత మంది ధనికులున్నా, దేశానికి దారిద్ర్యం తప్పింది కాదు.

నెల పొడుగునా ఓపికగా నేర్పినవాడికి ఒక్క రూపాయి ఇస్తారు. దస్తావేజు రిజిష్టరు చెయ్యడానికి ఏదో సాయం చేసిన బంట్రోతుకు మూడు రూపాయలు భక్షీసు ఇస్తారు. క్షణ సౌఖ్యానికి వందలు ఖర్చు పెడతారు. రాత్రనక పగలనక కష్టపడేవారికి దమ్మిడీలు లెక్కపెట్టి "చెక్కు" చేస్తారు. కరివేపాకూ, తోటకూరా కొన్నప్పుడు, మూడు దమ్మిడీలకు—పరమపట్టు దలలో బేరమాడుతారు పట్టుచీరలు కొన్నప్పుడు పదులయినా లక్ష్యంచేయక బడాయిస్తారు వేడుకకోసం రూపాయలు ఖర్చుపెడతారు; వీధిలో అడుక్కునే వాడికి ఒక్క దమ్మిడీ ఇయ్యరు

ఇదంతా న్యాయమే అనుకుంటారు. ఇలా చెయ్యడానికి వీరికి హక్కుందనుకుంటారు. ఇదంతా మా సొత్తే కదా అనుకుంటారు. అంతే కాని, ఇది ఇతరులకు చెందవలసినది తాను అపహరించి తనది అని అన్యాయంగా అంటున్నానని అనుకోరు. తమ కష్టార్జితమనే అనుకుంటారుగాని, ఇతరులను మోసం చేశామనీ తలచరు. తాను జమ చేశానని ఆనందిస్తాడే కాని, ఎన్ని కొంపలను ధ్వంసం చేశాడో—ఆ మాట తలచుకోడు. పరిశ్రమలో పెకం కూర్చిన వాడూ, యుద్ధాలలో పెద్ద వాడయినవాడూ, వర్తకంతో ధనికు డయినవాడూ, లాటరీలో పెటి అయిపోయినవాడూ ఆ సొత్తంతా తాను చెమటూర్చి గడించిందే అనుకుంటాడు. నిజానికి వీరికి చెమటే లేదు. అసలు చెమట ఊర్చినవాడు ఒక్కపూట భోజనాలతో ఉపోష్యాలు జరుపుతున్నాడు. వీరు ఉయ్యాల మంచం మీద ఊగుతున్నారు. అయినా, ఇదంతా నాదే అని ఉబ్బుటుంటారు. ఇదంతా వటి దోపిడీ— అయిపోయినవాడూ, ఆ సొత్తంతా తాను చెమటూర్చి గడించిందే అనుకుంటాడు. నిజానికి వీరికి చెమటే లేదు. అసలు చెమట ఊర్చినవాడు ఒక్కపూట భోజనాలతో ఉపోష్యాలు జరుపుతున్నాడు. వీరు ఉయ్యాల

మంచం మీద ఊగుతున్నారు. అయినా, ఇదంతా నాదే అని ఉబ్బుతుంటారు. ఇదంతా వట్టి దోపిడీ—ఇప్పటి శిక్షాస్మృతికి చిక్కని దోపిడి అని అనుకోకుండా ఉన్నారు.

ప్లీడరుగారి భవనం కట్టినవి ఆ పాడుముండ ఇటుకలా? పార్టీలు పడ్డ పనికిమాలిన పాట్లా? పెద్ద వ్యాపారస్థుడు దివ్యమందిరం కట్టిస్తే అదంతా సున్నం రాయి చేసిన దని అంటారా? ఇతరులకు చేసిన మోసం అంతా ఇలా మారి మందిర మయిందంటారా? యుద్ధంలో దొరికిన ధనం అంతా నాయకుడిసొమ్మా? ప్రాణాలను లక్ష్య పెట్టకుండా పోరాడిన భటులదంటారా?

అందుచేతనే అలెగ్జాండరువంటి నాయకులు దిగ్విజయ యాత్రలు చేసినప్పుడు ప్రతి భటునికి తగినట్టు గొప్ప గొప్ప పారితోషికా లిచ్చారు. పేరు నాయకుడిది. లాభం అందరిదీని అదే న్యాయబుద్ధి — దొరలలో నయినా, దొంగలలో నయినా, అంతేగాని చేరిన ధనం అంతా నా ప్రయోజకత్వమే అని నొల్లుకుంటే తప్పు. అలా కొంత ధనం చేరవచ్చినా, అది ప్రజలదే అన్న దృష్టి ఉండాలి. ఆ ప్రజలకు అవసరం వచ్చినప్పుడు ఈ ధనం అమనుకు రావాలి. ఆ బుద్ధి ఉన్నవాడే దొర. అది లేనివాడే దొంగ.

# కర్మ ! ఇదొక హేయం తలంపు

అడుక్కు తినేవాడు దేశ దౌర్భాగ్యానికి ప్రత్యక్ష నిదర్శనం; ముష్టి వాడు సంఘంలోని పశు స్వభావానికి తార్కాణం. దీనాతి దీనమైన బిచ్చగాడి స్థితి చూచిన మనిషి సిగ్గుతో తలవంచుకు పోవాలి. ఏదో మహా హేయమైన దోషం చేసినవాడిలా లజ్జతో క్రుంగిపోవాలి. ఆ నీచత్వం అంతా ఆ ముష్టి వాడిదికాదు; తనదీ తన సంఘానిదీ అన్న సత్యం శూలంలాగా, తన హృదయంలో గుచ్చుకోవాలి.

కాని, మన ప్రపంచంలో జరుగుతున్నదేమిటి? దారిపొంత పడవేసిన ఎంగిలాకు (పుల్లాకు) కోసం కుక్కలతో పోట్లాడుతూ ఉన్న అడుక్కుతినే వాడిని చూచినా, మన పండితుడికి, మన వేదాంతికి, చీమ కుట్టినట్టయినా ఉండదు. "అంతా కర్మ" అని, తన ఆధ్యాత్మిక విజ్ఞానం వెళ్ళగక్కుతాడు. దానితో ప్రపంచంలో ఇప్పుడున్న ఈ నీచ విపర్యాసాన్ని సమర్థించినట్టు సంతోషిస్తాడు. మహా విజ్ఞానులను గూడ తికమకలు పెడుతున్న ఈ ముష్టి వాళ్ళ సమస్యకు తగిన సమాధానం చెప్పివేసినట్లు ఆనందిస్తాడు. నిశ్చింతగా తన దారిని పోతాడు.

కర్మ అట కర్మ! ఎవడి కర్మ? ఆ అడుక్కుతినే వాడి కర్మా? చూచినంత మాత్రాన గుండె బ్రద్దలయినంత ఆవేదనపొందే సహృదయుడి కర్మా? ధర్మక్షేత్రమని గర్విస్తూ ఉండిన ఈ భరత వర్షంలో ఈ అధర్మ మేమిటని నలుగురు ఎ య్యబట్టినప్పుడు మహావమానంతో బాధపడే దేశీయుడిదా ఈ కర్మ? కాక వివిధ దేశాలలోని సాంఘిక వ్యవస్థలను గురించి ప్రసంగించుకుంటున్నప్పుడు, కేవలం దిషిబొమ్మలాగ —— బిచ్చగాళ్ళనే మసిమచ్చల ముఖంతో——కనబడే భరతమాతదా యీ కర్మ?

కర్మ: ఇది మన వేదాంతులు తయారుచేసి ఉంచుకున్న "మాయ తలుపు"—రహస్యద్వారం. తెలివి తేటలతో కార్యకారణ సమన్వయం చెయ్యడానికి శక్తి లేనప్పుడు. మన వేదాంతులు ఈ తలుపుమీట నొక్కుతారు. కర్మ అన్న ఈ తలుపు తెరుచుకుంటుంది; ఆ మార్గంగా తప్పించుకుంటారు. కర్మ అని పేరు పెట్టిన తరువాత కాదని వాదించడానికీ వీలే లేదని వీరి ధైర్యం.

అంటే, పూర్వజన్మలో చేసిన పాపాలకు ఫలితంగా ఈ బిచ్చగాళ్ళిప్పుడిలా గున్నారని వీరి సమాధానం. పూర్వజన్మలోని నేరానికి ఈ జన్మలో ఇది శిక్ష అన్నమాట. ఈ శిక్ష అనుభవిస్తున్నవాడికి తాను ఆ కిందటి జన్మలో చేసిన నేరమేమిటో తెలియదు. మళ్ళా ఆ నేరమే చేయవచ్చు; మళ్ళా ఈ శిక్షే పొందవచ్చు. శిక్ష నిష్ప్రయోజన మవుతుంది. ఇదేమి శిక్షాసన్మతో ఆ "భగవంతుడి"కే తెలియాలి.ఎదురుగా కనబడక పోబట్టి ఆ "భగవంతుడు" బతికిపోయాడు. లేకపోతె బుద్ధిమంతుల ప్రశ్నలకు తగిన బదులు చెప్పలేక, తన అధికారాన్నే చాలించుకు పోయేవాడు. ఈ కర్మ సిద్ధాంతానికి అపర కర్మలు జరిగిపోయేవి.

నవ్వులాటకాదు; చూడండి ఈనాడు రష్యా, చీనా, ఇలాంటి పెద్ద పెద్ద రాజ్యాలలో మచ్చుకయినా బిచ్చగాడు కనిపించడు. అడుక్కుంటేనే కాని పొట్టగడవదన్న అవస్థలో ఉన్నవారు అగపడరు. ఒకనాడు ఆ దేశాలలో కూడా అడుక్కుతిన్నవాళ్ళు లక్షలకొద్దీ ఉండేవారు: మన దేశంలో లాగానే అక్కడగూడా అదంతా కర్మ అనుకునేవారు ఏమయినట్టు: అడుక్కుతినే శిక్ష విధించదానికి తగిన నేరం కిందటి జన్మలో ఎవ్వడూ చేయలేదా ఆ భూభాగంలో? కాక ఆ కిందటి జన్మ నేరానికి వేరే శిక్ష ఏదయినా ఏర్పాటు చేశారా? నూరుకోట్ల ప్రజలు ఒక్కసారి బుద్ధిమంతులయిపోయి, ఆ పాప కర్మలు చేయడం మానుకున్నారా? ఇప్పుడక్కడ ఈ ముష్టి శిక్ష కానరాదేమి? మిధ్యావాదము; దబ్బర.

అంతేకాదు; ఈ కర్మ అన్న సిద్ధాంతం ఎంత అమానుషత్వానికి—ఎంత రాక్షసత్వానికి—దారితీస్తుందో చూడండి; ఈ అడుక్కుతినేవాడు ఏదో

మహా దోషం చేశాడు భగవంతుడు క్షమించలేక పోయాడు; ఈ దారుణ మయిన శిక్ష విధించాడు. వీడు ఈలాగ బాధపడటం భగవత్ సంకల్పం. ఆ భగవత్ సంకల్పానికి వ్యతిరేకంగా గాని, విరుద్ధంగా గాని మనము ప్రవ ర్తించకూడదు. అలా ప్రవర్తిస్తే మనము దోషం చేసిన వారము; పాపుల మవుతాము. అంటే భగవత్ సంకల్పమయిన ఆ ముష్టివాడి బాధను తగ్గించ టానికి మనమేమి చేయకూడదన్నమాట. వాడు ఆకలి చిచ్చుతో దగ్ధమయి పోతూవుంటే, మనం చూస్తూ పోవలసిందేకాని, పట్టెడన్నమో. గుక్కెడు గంజో ఇవ్వకూడదు ఆ విధంగా వాడి బాధను— భగవత్ శిక్షను— తగ్గించడానికి ప్రయత్నించకూడదు. దైవభక్తి, మతగౌరవం కలవాళ్ళు ఆ ఆలోచనకు పోకూడదు. అది భగవత్ ధిక్కార మనిపించుకుంటుంది. ఈ ప్రకారంగా ఊహలు సాగుతాయి శాస్త్ర సమ్మతంగానే సాగుతాయి. ఆ అడుగుకు తినేవాడికీ సాయంచేసినవాడు దైవధిక్కారం చేసి పాపి అవుతాడు- అని తేలుతుంది. ఇంక మానవత్వం ఏమి నిలుస్తుం ? పశుత్వం - కాదు పిశాచత్వం - ప్రబలిపోదా, మన కర్మ అలా కాలుతుంది.

కాదు పోదు అని కర్మ సిద్ధాంతం నిలుపుదా మంటే. చిన్న సవ రణను అంగీకరించాలి. ఆ కర్మ ఈ అడుక్కు తినేవాడు పూర్వజన్మలో చేసిన పాపకర్మ కాదనీ, వారిచేత అడిగించుకుంటూ ఉన్న మన సంఘం చేసిన—చేస్తూవున్న—ఒక మహా పాపకర్మేననీ అనాలి. సంఘం సోదర భావంతో ప్రవర్తించి ఉన్నట్టయితే, ఈ దురవస్థ వచ్చేది కాదు. పుచ్చుకో వలసినంత పుచ్చుకొని, ఇవ్వవలసినంత ఇస్తుంటే ఈ దుర్గతి దేశానికి కలిగేదికాదు. మతం పేరున వచ్చిన దానాల వ్యామోహంలో పడి ధర్మాన్ని మరచిపోకుండా ఉంటే ఈ అగచాట్లు దాపురించేవి కావు. ఇతరులనుమాపి ఇనపపెట్టెలు నింపుకొనేవాళ్ళను సంఘం గౌరవించకుండాఉంటే ఈఅనర్థకం వచ్చేది కాదు. ఘోరమైన ఈ దురవస్థ కలగడానికి ముఖ్యకారణం మన సంఘమే- ఈసమాజమే. ఎందరు విద్వాంసులున్నా, ఎంత జ్ఞానం పెరిగినా, ఎంతటి ప్రతిభావంతులున్నా, ఇది అంతా మనవారి బుద్ధిహీనతే. ఈ నిందను మన సంఘం తప్పించుకోలేదు.

ఈ సత్యాన్ని రుజువు చెయ్యడానికి శ్రమపడనక్కరే ఉం డకూడదు అయినా, మొన్న 1961 సంవత్సరం అక్టోబరు 12 ఎ తేదీన మద్రాసు హైకోర్టు న్యాయమూర్తులు "హత్య-ఆత్మహత్య యత్నాలు" అన్న ఒక నేరపు కేసులో ఇచ్చిన తీర్పు ఈ సిద్ధాంతానికి బలకరంగా ఉంటుందని, ఆ వార్తను "విశాలాంధ్ర" నుంచి తీసుకొని ఇక్కడ ప్రచురిస్తున్నాను.

## అన్నం పెట్టలేక కన్నబిడ్డలను చంపిన తల్లి

*దారిద్ర్యంబాధ భరించలేక కన్నబిడ్డలను నూతిలో పారవేసి, తానుకూడా చనిపోవడానికి నూతిలో దూకిన కామాక్షి అమ్మాళ్ అనే 25 సంవత్సరాల స్త్రీకి హత్యా, ఆత్మహత్యా యత్నాలక్రింద రెండు సంవత్సరాల శిక్షను మద్రాసు న్యాయమూర్తులు శ్రీ అనంతనారాయణ, శ్రీ వెంకటాద్రిగార్లు నేడు ఖాయపరిచారు.*

*న్యాయమూర్తులు తమ తీర్పులో ఈ నేరం వ్యక్తిగత ప్రవర్తనకు సంబంధించినది కాదనీ, ఇది ఒక సాంఘిక విషాద ఘటన అనీ పేర్కొన్నారు.*

*కామాక్షి అమ్మాళ్ 1960 మే 19 వ తేదీన తన ఒకటిన్నర ఏండ్ల వయస్సుగల సుబ్రహ్మణ్యం అనే కుమారునీ, మూడున్నర ఏళ్ళ వయస్సుగల రాజమ్మాళ్ అనే కుమార్తెనూ నూతిలో పడవేసినది. ఆర్ముగం అనే పిల్లవానిని కూడ నూతిలోనికి తోయడానికి యత్నించింది. తాను కూడా దూకింది. ఇద్దరు బిడ్డలూ చనిపోయారు. కామాక్షిఅమ్మాళ్‌ను చావకుండా బయటికి తీశారు. తన కన్నబిడ్డలను తాను చేతులారా చంపుకోడానికి దారితీసిన విషాద గాథను న్యాయమూర్తులు తమ తీర్పులో యిలా వివరించారు:*

*"కామాక్షి కరూరులో ఒక స్వర్ణకారుని వివాహమాడింది. అక్కడ భర్తకు పని దొరకలేదు. అక్కడనుంచి దిండిగల్; అక్కడ నుండి తిరుచి వెళ్ళారు. కాని, పని తిండి, దొరకలేదు. కామాక్షి అమ్మాళ్ అనేక*

చోట్ల బిచ్చమెత్తి పిల్లల్ని పోషించడానికి యత్నించింది. కాని లాభం లేకపోయింది. దీనితో విసిగి వేసారి. ఇటువంటి దారిద్ర్యబాధ పడే కంటే మరణించడమే మేలనే నిశ్చయానికి వచ్చింది. పిల్లలను నూతిలో పడవేసింది. దారిద్ర్యబాధకు తాళలేకనే కామాక్షి అమ్మాళ్ ఈ విధంగా చేసినట్లు రికార్డుల వలన స్పష్టమవుతున్నది.

ఈ ఉదంతానికి వెనుక గల సాంఘిక విషాద పరిస్థితిపై మేము కొంత వ్యాఖ్యానించకుండా ఉండజాలము. సాధారణంగా న్యాయ మూర్తులు నేరం జరిగిందా లేదా అని మాత్రమే విచారిస్తారు; శిక్ష విధించుతారు. ఈ నేరానికి దారి తీసిన సాంఘిక పరిస్థితులను గురించి, వాటి నివారణోపాయాలను గురించి పట్టించుకోవలసినది సాంఘిక వేత్తలు, రాజకీయ వేత్తలు, సంస్కరణ వేత్తలున్నూ

కాని, ఈ కేసు విషయంలో, వ్యక్తిగత ప్రవర్తనే ఈ నేరానికి కారణం కాదు. సాంఘిక విషాద పరిస్థితి కూడ ఇందుకు కారణం. ఇది యావత్తు సమాజమూ ఆలోచించవలసిన, ఆందోళన పడవలసిన విష యం ఇటువంటి విషాదఘటనను సమాజం ఇకముందు జరగకుండా చూడాలి. ఇటువంటి విషయంలో న్యాయస్థానాలు చూస్తూ ఊరుకోవు.

ఇతర దేశాలలో పని లేనివారికి ఇంత కడుపు నింపుకోడానికి భృతి లభించేటట్లు పని కల్పించుతారు. అక్కడ ఎవరయినా సరే పనిచేసి కొంత డబ్బు సంపాదించుకోవచ్చు. మన దేశంలో అటువంటి పని కేంద్రాలను నెలకొల్పాలి. వ్యవసాయిక రాష్ట్రమైన మన రాష్ట్రంలో వ్యవసాయ తరుణంలో నైనా పని చూపించవచ్చును. ఏది ఏమయినప్పటికీ ఈ పని కల్పించే సమస్య క్లిష్టమైన దయినప్ప టికీ ఇటువంటి విషాద ఘటనలు ఇకముందు జరగకుండా చూడాలి.

సంక్షేమ ప్రభుత్వం ఏర్పరచాలన్న విషయం ఇప్పుడు పూర్తిగా గుర్తించబడుతూంది కనుక అరిస్టాటిల్ చెప్పినట్లు, ప్రభుత్వం ప్రజలకు జీవనావకాశం కల్గించడమేగాక, మంచి జీవితం గడపడానికి కూడా అవకాశం కలిగించాలి. రాజ్యాంగ యంత్రానికి సారథ్యం వహం

*చేవారు అందుకు తగు సంస్కరణలు తీసుకొని రావడానికి యత్నించాలి. కామాక్షిఅమ్మాళ్, ఆమె భర్తలాంటివారు. కాయకష్టం చేయడానికి తగిన స్థితిలోఉండీ, పని చేయడానికి సంసిద్ధంగా ఉండీ కూడా కనీస జీవితావసరాలు దొరకక, బిచ్చం యెత్తలేక, ఇటువంటి విషాద పరిస్థితులకు దారితీయవలసిన అవసరం కలగకుండా చేయాలి."*

న్యాయమూర్తులు చెప్పినట్లు ఇది సంఘ దోషం. ప్రజలూ, పాలకులూ బాధ్యులు. ఆ దోషాన్ని వీరు నిర్మూలించాలి. తరవాత చూద్దా మనవలసిన విషయం కాదు. అత్యవసరం. ఇప్పటికే ఘోరమైన జాప్యం జరిగింది. డబ్బులేదన్న సాకు దబ్బర. గ్రామాలూ, నగరాలూ సుందరంగా చెయ్యాలంటున్నారు. నందనోద్యానాలు చేయాలంటున్నారు. సిమెంటురోడ్లూ, మహామందిరాలూ, జలయంత్రాలతో బృందావనాలూ తలపెడుతున్నారు. డబ్బులేదని ఎలా అనగలరు? ఒక్క మాట మాత్రం మరువకూడదు. సంఘజీవితమూ, నగరజీవితమూ అందంగా ఉండాలంటే, ఈ అడుక్కుతినే ముష్టివాళ్ళన్న కళంకం—ఈ మచ్చ—ప్రజాజీవితంలో లేకుండా పోవాలి. అది జరగనంతకాలం అందమన్నమాట మన జీవితాలకు అంటదు; అతకదు.

ఉండడమో, లేకపోవడమో, ఉన్నవాళ్ళందరికీ ఒక్కలాగానే ఉండాలి. అలా ఉంటేనే, అది సంఘం అనిపించుకుంటుంది; దానిని ఒక కుటుంబం అంటాము. అంతేకాని, ఒకడికి మాత్రం ప్రత్యేకంగా లేమికలిగిందన్నా వాడొక్కడే అడుక్కుని తింటున్నాడన్నా, అది సంఘంకాదు, కుటుంబం కాదు. అధ్వానమూ, అన్యాయమూ.

మొదట ఒక కుటుంబంలాగా వుండే ఈ సంఘంలో ఎవడికి చేతనయినంత పని వాడు చేసేవాడు. అందరితో సమానంగా అనుభవించేవాడు. ఏమయినా వ్యత్యాసా లున్నాయన్నా, అవన్నీ చాలా స్వల్పంగా వుండేవి. ఎక్కువ దొరికినవాడు తక్కున వారితో పంచుకొనేవాడు. ఇవ్వడానికే చూచేవాడు. అదే వాడి ధర్మం, ప్రపంచ ధర్మం.

అలాంటి సంఘంలోకి మెల్లగా మతాన్ని ప్రవేశపెట్టారు మేమంతా పెద్దల మన్నారు. ధర్మానికి దానం అని పేరుపెట్టారు. సంఘానికి దారిద్ర్యం దాపురించింది. లేనివాడిని చూస్తూ వున్నవాడు వున్నవాడికే ఇచ్చాడు. ఈ విపర్యాసాన్ని గుర్తించే ఒక కవి "కుక్క ఏనుగు" సాదృశం చూపుతూ ఇలా అన్నాడు :

వాలము నులిచియు, నేల కాళ్ళణచియు,
ధాత్రిపై పొరలియు తాల్మి విడిచి
వదనంబు తెరచియు, ఉదరంబు చూపియు,
పెక్కు పాటులబడ్డ కుక్క కొక్క
కడిమాత్ర మన్న మాకలి దీర ఇడబోరు;
నాగంబునకు ప్రార్థనంబుతోడ

కబళశతంబులు కరమున కందీయ
ఆకలిదీరగ అది భుజించు,
ఎంత వేడిన దీనున కివ్వబోరు;
ఇచ్చిరేనియు, కదుకొంచెం, మెచ్చులేదు
ఘనున కూరకయుండిన, కాంక్షదీర
గురుతరార్థంబు లిత్తురు ధరణి జనులు.

ఈ విపర్యాసం కలగడానికి ముఖ్యకారణం ఒక్కటే. ఆర్థిక విషయంలోనూ, సాంఘిక విషయంలోనూ, మతాన్ని ప్రవేశ పెట్టడమే. మతంతో సంబంధం లేని విషయాలమీద మతాధికారం చెలాయించినట్లు చేసినందువల్లనే ఈ అనర్థకం కలిగింది

ఇలాంటి అనర్థకమే విద్యలోనూ, వివాహంలోనూ గూడా కలిగిందని పెద్దలు సవిమర్శకంగా నిర్ధారణ చేశారు. దీనివల్లనే పండువంటి సంసారాలు పాడుపడ్డాయి ప్రశస్తమయిన కుటుంబాలు పేరూ ఊరూ లేకుండా నశించి పోయాయి అని ఈ విద్వాంసులు చెప్పుతారు.

కాని, ప్రస్తుతం ఆ వ్యామోహం ప్రజలలో తగ్గింది. నిజమే కాని, ఇంకా ఆచారం అన్న సంకెళ్ళు తెగలేదు. బుద్ధి — ఎంత వికసించినా— ఆ రస్తాలలోనే నడుస్తూ వుంది. సరియయిన మార్గానికి తిప్పడానికి, కొంచెం గట్టి ప్రయత్నం చెయ్యాలి.

బిచ్చగాని సృష్టి భగవంతుడిది కాదనీ, మనం చేతులారా చేసిన దోషం అనీ గ్రహించాలి. అడిగేవాడూ అడగకతీరనివాడూ వుండడం అంతా సృష్టి సూత్రాలకు ప్రత్యక్ష విరుద్ధం అని తెలుసుకోవాలి.

"ధర్మం చెయ్యండి బాబూ" అన్నమాటలు ఒక దీనుడినోట వచ్చాయి అంటే, వాడు ఏదో యాచిస్తున్నాడని అనుకోవడం చాలా పెద్ద పొరపాటు —పాపం అన్నా తప్పులేదు. చెయ్యవలసిన పనిని చెంప పెట్టు పెట్టి స్మరణకు తెస్తున్నాడన్నమాట. అటువంటి వాడికి లేదు అనడం రాక్షసకృత్యం -అవును, ఉభయ పక్షాలా రాక్షసులమే. లేదన్నవాడు రాక్షసి; లేదనిపించుకొని, నిరాశకు బలి అయి, అవతలివాడుగూడా మనుష్యులంటే అసహ్యించు

కుంటాడు. పశువు భావం పొందుతాడు; రాక్షసుడవుతాడు ఈ రాక్షసత్వాని కంతటికీ, మనమే కారకులమవుతాము.

ఇంతేకాదు; మరొక్క సంగతి. ఒకడు బిచ్చ మెత్తుకోవలసిన అవసరం ఎందుకు వచ్చిందో అడిగి తెలుసుకోండి—ఒక్కసారి—వాడి లోపం ఎంతవుందో ? ఇతరుల మోసం ఎంతవుందో తెలుస్తుంది. సుఖంగా నలుగురిలాగా బతుకుతూ వుండేవాడిని యీ ఘోర నరకంలోనికి త్రోసిన వారెవరో తేటపడుతుంది. వీడు బిచ్చమెత్తుకుంటాడు; వీడిని మోసం చేసిన మహాపురుషుడు అతని దగ్గరవున్న సొత్తంతా తన స్వార్జితమే అని, చంక లెగురవేస్తుంటాడు అప్పుడుగాని మానవసంఘంలోని మహాద్రోహం బయట పడదు.

ఆ ప్రయత్నమే నేను కొంత చేశాను. కొందరు అడుక్కుతినేవాళ్ళ "ఆత్మ చరిత్రలు" సంగ్రహించాను. ఈ మహా సమస్య ఇంకా చక్కగా తేటపడడానికి వాటిలో కొన్నింటిని అనుబంధంగా ప్రచురిస్తున్నాను. ఈ అనుబంధాన్ని "అడుక్కుతినే ముష్టివాళ్ళు" అన్నాను అడుక్కుతినడం అనీ, ముష్టివాళ్ళనీ పేరులోనే పునరుక్తి వచ్చిందని నిరసించకండి. ఈ నామకరణం చేసినది ఒక ఇంటి భాగ్యశాలి.

"ధర్మం చెయ్యండమ్మా. పట్టెడన్నం తల్లీ"అన్నందుకు ఆయమ్మ గబగబా వచ్చి "అబ్బా ఈ అడుక్కుతినే ముష్టివాళ్ళ పోరు పడలేకుండా వున్నామమ్మా!" అని వాకిలి గభాలున మూసింది అడుక్కుతినే వాడి గుండె పెరీలున పగిలింది.

అతడు కాలుతున్న తన పొట్టకోసం ఆవేళ అడగలేదు, వచ్చేప్రాణం పొయ్యే ప్రాణం అన్నట్టున్న ఒక చిన్న పిల్లకోసం అడిగాడు. ఇంతఅన్నం తేట పడితే తెల్లవారిల్లి ఆ పిల్ల బతుకుతుందన్న ఆశతో వచ్చాడు. ఒకటి రెండిళ్ళ దగ్గర అరిచాడు. "ఇంకా భోజనాలు కాలేదు" అని ఒక యిల్లు ! "భోజనాలయి పోయాయ్,పో"మ్మని మరొకయిల్లు "వీళ్ళకు వేళాపాళాలేదు" అని మరొకయిల్లు మొండిచెయ్యి చూపించాయి.

ఈ భోజనాల ప్రసక్తి చూశారా ! భోజనాలకు ముందు మాధవ కబళం వెయ్యరు ;భోజనాలయిపోయిన తరువాత లేదన్నారు. ఇక భోజనాలు జరుగుతూవుండగా వస్తే వేస్తారంటారా? వట్టిది; కాబట్టి ఈ ప్రసక్తి అంతా వట్టి సాకు. అసలు ఆ యిళ్ళల్లో లేనిది అన్నంకాదు హృదయం; మానవ స్వభావం!

లేదన్న మాటలు వింటూ ఆ గుమ్మం దగ్గర, ఈ గుమ్మం దగ్గర అరుస్తూఉన్నాడేగాని వాడిమనసంతా "ఆలస్యమయిపోతూందే ఏమవుతుందో? ఆ ప్రాణం అలాగే ఎగిరిపోయే ఉంటుందేమో" అని అనేకవిధాలా ఆలోచనలు పరుగెడుతున్నాయి. వీధి చివరి యిల్లు అది. ఇక్కడ చిక్కలేదంటే మరొక గంటదాకా వీలులేదన్నమాట. ఇక్కడగూడా లేదన్నదా అమ్మ. ఇంకా బిచ్చగా దేమి చేస్తాడు?

# అడుక్కు తినే వాళ్లు

చెరువు గట్టున మురికి గుడిసె. నేలంతా తడిసి తేమగా వుంది. ఒక మూల చింకిచాపమీద ఒక చినుగుల గోనె, దానిమీద అస్సరస్సరంటూ కొట్టుకుంటున్న పదేళ్ళపిల్ల. జ్వరం; ఒంటిమీద ఎడ్లగింజలు వేస్తే పేలాలులా పేల్చేటంతటి జ్వరం. ఆ శరీరంలో తులమెత్తు మాంసమయినా ఉండదు. వచ్చేప్రాణం పొయ్యేప్రాణం అవుతూ వుంది.

చూస్తున్నారు ప్రక్కనున్న అడుక్కొనేవాళ్ళు. గుక్కెడు అన్నం తేట పట్టి తే,తెప్పరిల్లుతుందని అనుకున్నారు. వారం రోజుల నుంచి అన్నమెలాంటిదో ఆ పిల్లకు తెలియదు అందుచేతనే ఆ ఆశ అంకురించింది. అందరి బొచ్చెలూ ఖాళీగానే ఉన్నాయి. ఏమి చేయడం అని ఒకరి మొఖం ఒకరు చూచుకుంటున్నారు.

దమ్మడు కదిలాడు బొచ్చె పట్టుకొని, అక్కడా అక్కడా "అమ్మా, పిడికె డన్నం తల్లీ". "ధర్మం చెయ్యండి బాబూ" అని అడుక్కుంటూ పోతున్నాడు. లేదు, చేయివల్లకాదు, భోజనాలు కాలేదు, భోజనాలయి పోయాయి ...ఇలాంటి జవాబులే ప్రతి యింటాను.

వీధి చివరకొచ్చాడు వట్టి బొచ్చెతోనే. ఇంకా ఒక యిల్లుంది ఆ ఆ వీధిని ఇక్కడ ఏమయినా దొరుకుతే సరే; లేకపోతే వట్టి చేతులతో పోవలసిందే, తిరిగి ఆ మురికి గుడిసెకు. అది పెద్ద భవనం. తప్పకుండా పిడికెడు దొరుకుతుందనే ఆశించాడు దమ్మడు. "ధర్మంచెయ్యండమ్మా- పిడికె డన్నం పెట్టండి తల్లీ" అని అరిచాడు. మళ్ళా అరిచాడు.

ఒకనమ్మ లోపలనుండి గబగబా వచ్చి "అబ్బబ్బా ! ఈ అడుక్కు-తినే ముష్టివాళ్ళ పోరు పడలేకుండా ఉన్నానమ్మా" అంటూ, గభాలున వాకిలి మూసింది. దమ్మడి గుండె పెరీలున పగిలింది

దమ్మడిది మంచి మనసు. మనలో పుట్టిఉంటే ధర్మన్న అనే పిలిచేవారము; ఆ పిల్లకు దమ్మడంటే చాలా యిష్టం; ఆ పిల్లంటే దమ్మడికి అంత అభిమానం. వీలున్నప్పుడల్లా ఆ పిల్లకోసం తినడానికి ఏదయినా దాచి యిచ్చేవాడు. ఇప్పుడాఖరు ఆశ అంతరించిపోయింది. పై వీధికెళ్ళాలంటే వ్యవధి కావాలి. ఈ లోగా పిల్ల ఏమవుతుందో. వట్టిచేతులతో పోవడానికి కాళ్ళురావు.

ఆ యింటి ముందలాగా ఒక అయిదు నిముషాలు కొయ్యబారి నిలిచిపోయాడు. అడుక్కు-తినేవాళ్ళమేనా? అని తన్ను తా నడుక్కు-న్నాడు అడుక్కో-పడమే మా పంతుగాని, తినడం ఎక్కడుంది? అని అనుకున్నాడు. అడగకుండా తినే వాళ్ళున్నారు. అడిగయినా తినేవారూ ఉన్నారు. కానిఈ అడుక్కు-న్న ముష్టివాళ్ళకి తినడం ఉందా ? అనిఅనుకుంటూ చెరువుగట్టుకు నడుస్తున్నాడు.

మా పోరు పడలేకుండా ఉన్నారట ! హుఁ ! ఎవరిపోరు ఎవరు పడలేకుండా ఉన్నారో ఎలాగ తెలుస్తుంది? ఇంతకూ ముష్టివాళ్ళ పెట్టే పోరేముంది? అమ్మా అని అడుగుతారు. ఇస్తే సంతోషిస్తారు. లేకపోతే మరొక గడపకు పోతారు. పోరేముంది? అని తర్కించుకుంటున్నాడు. ఊహలు పరుగెడుతున్నాయి కాళ్ళు అలవాటుకొద్దీ తోవ తొక్కు-కుపోతున్నాయి

వెనకనుంచి "దమ్మన్నా దమ్మన్నా" అని పిలుపు వినిపించింది. తిరిగి చూచాడు. ఆ భవనంలో తోటపని చేస్తూవుండే మాలీ కూతురు పరిగెత్తుకుంటూవచ్చి "ఇందా" అని పట్టెడన్నం దమ్మడి బొచ్చెలో వేసింది. ఇంటి భాగ్యశాలి గభాలున తలుపు మూయడమూ, దమ్మడు నిర్ఘాంతపోయి చేసింది నిలవడమూ చూచింది. ఆ చిన్న హృదయంలో ఏ తీగ కదిలిందో, ఈ పని అన్నంవేసి ఆ పరుగునే వెళ్ళిపోయింది.

దమ్మడచే చూచాడు. నా తల్లి, నా తల్లి అనుకున్నాడు. చక చకా గుడిసెకు బయలుదేరాడు.

గుడిసెలోనున్న వాళ్ళంతా కొయ్య బొమ్మల్లాగా కూర్చొని ఉన్నారు. మాటలేదు; ఎలాంటి శబ్దమూ లేదు అంతా సమాధి నిశ్శబ్దం. పరుగు పరుగున వస్తున్న దమ్మడి కాళ్ళకీ సంకెళ్ళలాగయింది నడక మందగించింది గుండె బరువెక్కిపోతూ ఉంది. చెమట కమ్ముకొతూఉంది ఒళ్ళంతా.

అక్కడున్నవారిలో ఒకడుచొరవచేసుకొని "పోయిందిరాదమ్మనా్న" అన్నాడు.

దమ్మడు "ఆః" అని ఆగిపోయాడు. దానితో అక్కడి వాళ్ళనోళ్ళు అన్నీ తాళాలు వీడాయి. మనిషొకమాట అందిస్తున్నారు. అందరి మాటలూ ఆ చనిపోయిన పిల్లను గురించే ?

"పిల్లంటే పిల్లా ? మల్లా అలాంటి పిల్లను సూడగలమా ?"

"దమ్మన్నంటే పాణం పెట్టేది."

"ఒక్కటేమిటి ? ఎవడికైన బాధ కలిగిందంటే, సూడలేకపోయేది."

"సేతనైనంత సాయం సెయ్యాల; తాను సెయ్యడమేనా ? మనందరి సేత సాయం సెయ్యించేది."

"యెన్నలాటి మనసు గదరా ! ఒక్కడయినా, కసురుకోవడం సూశామా ? గట్టిగా మాట్లాడ్డం విన్నామా !"

మన గూడెంలో తప్ప పుట్టిందిరా. ఆ కళ్ళూ, ఆ ముక్కుతీరూ —అంత అందమైన పిల్లలు గొప్పోళ్ళ ఇళ్ళలోనైనా కనబడతారా చెప్పు "

"ఏమైతేనేమి? అది ఈ భూదేవికి బరువనిపించింది."

"మనమేదో అనుకుంటాం గాని ఒతికుండి ఏమి సుఖపడేది సెప్పండి మనతో పాటిట్టా సావుబతుకు బతకడమేగా! మనపిల్ల సచ్చిందంటే సుఖ పడ్డదన్నమాటే" అని ఒక వయసుమిరిన ముష్టివాడు తన అభిప్రాయం వెళ్ళబెట్టాడు.

దమ్మడి పెదవులు కదిలాయి. హుః అన్న ధ్వని వినిపించింది. "చచ్చిందిః" అని మహా ఎగతాళిగా అన్నాడు. ఒకసారి తల అటూ ఇటూ

త్రిప్పి——అక్కడ వాళ్ళనందరిని చూచాడు. కళ్ళు పెద్దలయి, యెర్రబారు తున్నాయి. ఆ కళ్ళ ముందు అందరూ పిల్లులలాగా ఒదిగి పోయారు.

ముక్కు-శిరా లెగురుతున్నాయి. దమ్మడి గొంతులో ఒక కటుత్వం. ఒక చురుకు కనబడుతుంది "చచ్చిందిరా ? ఆ పిల్ల చచ్చిందంటారా ? అది చావుకాదు. ఖూనీ ! ముమ్మాటికీ ఖూనీ. హత్య. లేకపోతే అంత చిన్నది, అంత మంచిది, అలాగ దిక్కు-లేని చావు ఎందుకు చస్తాది? ఖూనీ! ఖూనీ !

"ఈ ఖూనీ యిచారించడానికి కోర్టులు లేవు; శిక్షలు లేవు; హత్య చేసిన ఖూనీదార్లు కులాసాగా, గొప్పవాళ్ళ మనిపించుకుంటున్నారు. గుక్కెడు అన్నం లేట లేక ప్రాణం గుటుక్కు-మన్నదంటే, అది చాల్దా? ఆ గుక్కెడు నీళ్ళు ఇవ్వలేదే ఈ లోకం !

"ఏమి ? లేరా! లేకపోబట్టి లోకం ఇవ్వలేదంటారా? తప్పు ! అప రాధం ! ఎక్కి- తొక్కి- ఉంది చెత్త తొట్టెలలో వేస్తారు అమ్మా. ధర్మం చెయ్యండి అని అడిగేవాడి కివ్వరు, ఇవ్వరు; చేతులు రావు అందుకే అంటుంటారు చెయ్యి వల్లకాదు అని

"ఆ మాట 'వల్లకాదు' కాదు. "వల్లకాడు". ఆ చెయ్యి వల్లకాడే, ఇంక ఆ వల్లకాడు మనకిచ్చే దేముంటుంది.

"నెలకు రెండేసి వందలు మూడేసి వందలు ఖర్చుపెట్టి, కుక్క-లను పెంచుతారు; కళ్ళులేని కబోది కొక్క- కానీ యివ్వరు. ఈ లోకాన్నే మనాలి ?

"లోకం !"

"లోకం !" అంటున్నాడు దమ్మడు. పెదవులు విరుగుతున్నాయి. పళ్ళు కోరలలాగా - కనబడుతున్నాయి కళ్ళు చింత నిప్పులలాగా—— ఎఱ్ఱగా——ఉన్నాయి. ఏమి చూస్తున్నాడో తెలియదు. అసలు చూస్తున్నాడో లేదో గూడా కనబడదు. కళ్ళు మూతపడవు. కొయ్యబొమ్మ కళ్ళ లాగు న్నాయి. ఒళ్ళంతా చెమట! నుదురూ, ముఖమూ అంతా చెమట! ఊపిరి ఖుసకొడుతున్నట్లు వస్తూంది. శరీరం కంపించడానికి మొదలు పెట్టింది;

చూస్తూ ఉండగానే ఆ వణుకు ఎక్కువవుతూ ఉంది పెదవులేమో అంటు న్నట్టు కదులుతున్నాయి. కాని మాట బయటికి రాలేదు

అక్కడివాళ్ళంతా అదలిపోయారు.అలాగ నిలుచుండగానే ప్రాణాలు పోతాయా అని ఆందోళన పడుతున్నారు ఏమ చెయ్యడానికీ, ఎవరికీ ఏమి తోచలేదు

ఇంతలో యెంక డిన్ని నీళ్ళు తెచ్చి మొఖంమీద బలంగా చల్లాడు. ఆ ఉపచారం వల్ల అటుపోతున్న దమ్మడి ప్రాణం ఇటు తిరిగింది. తల కాయలో పరుగెడుతున్న ఆలోచన పిశాచాలన్నీ అదృశ్యమయి పోయాయి. కన్ను మూతపడ్డది. పెదవులు పలుకుతున్నాయి. అంకమ్మ ఒక గుడ్డలో ముఖం తుడిచింది. నారిగా డిన్ని నీళ్ళు తాపాడు.

మెల్లగా దమ్మడు తల ఊపి, యెంకడి మీద చెయ్యివేసి ఎందుకో గాని "యెంకా నువ్వెందు కదుక్కుంటున్నావురా ?" అని అడిగాడు.

# యెంకడి కథ

ఏం సెప్పమంటావు దమ్మన్నా ! నా అయిదో ఏటే మా అయ్య సచ్చిపోయాడు. అయ్యంటే అయ్యా ! ఆజానుబాహువు; అంతెత్తునుండే వాడు ఛాతీ, సేతులూ బాగా కండలు తిరిగి, నల్లగ, సిలాయిగ్గరం (శిలా విగ్రహం) లాగుండేవోడు తాలూకా కచ్చేరీలో జవాను నెలకు పన్నెండు రూపాయలు జీతం.

మా అయ్యా. అమ్మా నేనూ అంతే. మరెవ్వరూ కలిసొచ్చినోరు లేరు. గరానాగా బతికే వోళ్ళట.

ఆయేళ తాశీల్దారుగోరు కమాను,తాశీల్దారుకుటుంబంతోనే ప్రయాణం సేస్తాడు. మా అయ్యానుగూడా తీసుకెల్తాడు— ఒక్క క్షణం అయినా యిడిసిపెట్టేవోరు కారులే—ఏమంటావా? పిల్లల్నెత్తుకొని సందరించడానికీ, కూరా నారా తెచ్చిపెట్టడానికీ, ఒకటేంటి, ఇంటి శాకిరీ అంతా మాఅయ్యే. కచ్చేరీ బంట్రోతు అని పేరు; చేసినదంతా ఇంటిపనేలే. అందుకే యెంట తీసుకెల్తాడు—ఉట్టినేసా ?

తాశీల్దారు పిక్కట్లూ అన్నీ కొన్నాడు. అంతా రైలుబండెక్కారు. ఇంతలో లక్కపిడత లమ్మేవో డక్కడి కొచ్చాడట.

దమ్మన్నా ఆ సంగతంతా మా అమ్మే సెప్పాలి. పాపం ! సచ్చిపోయిందాకా సెప్పుతూనే ఉండేది. సెప్పుకొని సెప్పుకొని ఆ బెంగతోనే సచ్చిపోయింది మా యమ్మ.

కథ ఆగింది; యెంకడి కంటనీరు కారుతూంది పాపం.

చూచాడు దమ్మడు—ముఖం చూచాడో, ఆకాశం చూచాడో, ఏమి చూచాడో తెలియదు. దమ్మడి పెదవి విరిగింది. మరోమాట లేమ కాబట్టి అదీ "నవ్వే" అనాలి.

ఆ "నవ్వు"తో "ఒసి నీ పాసుగాలా! ఇంకా నీ కంటిలో ఇన్ని నీళ్ళున్నాయా యెంకన్నా?" అని దమ్మ డడిగాడు.

పక్కనున్న ఆడది పరాకాయించే చూచింది దమ్మడి మొఖం. దాని కంటా నీరు గూడుకట్టింది. పిల్ల బెదిరి, కెవ్వున అరిచి తల్లిని కౌగలించుకుంది.

సిగ్గుపడినట్టు యెంకడు కళ్ళు తుడుచుకొన్నాడు. చినిగి వేలాడుతూ ఉన్న చొక్కా పేలికతో

కథ సాగించాడు.

లక్క పిడతలోడు అరుసుకుంటూ పోయాడు — దూరంగా; తాశీల్దారు కూతురు – మూడేళ్ళు ఉంటాయట – ఒక లక్కపిడత కొనమని ఏడ్చింది.

తల్లి బుజ్జగించింది. తాశీల్దారు గద్దించాడు. పిల్ల మాత్రం ఏడుపొదల లేదు. శతపోరు పెట్టింది. ఎవరినీ నిలబడనియ్యలేదు.

తాశీల్దారు ఒకణా ఇచ్చి మా అయ్యని ఒక పిడత కొని తెమ్మన్నాడు.

"బండి కదిలే యేళయింది బాబూ" అన్నాడు అయ్య.

"ఛీ! యెదవా. పరుగున పోయి తీసుకురా" అని కోపగించుకున్నాడు తాశీల్దారు.

బండి దిగి మా అయ్య పరుగెత్తాడు. ఆ పివర నున్నాడు లక్క పిడతలోడు లక్కపిడత కొంటుండగానే బండి కదిలింది.

పరుగెత్తుకొస్తున్నాడు మాఅయ్య, బండి సాగిపోతూఉంది. తాశీల్దారు తా యెళిపోరా, రా యెళిపోరా అని అరుస్తున్నాడు. అయ్య పరిగెడుతున్నాడు. తాశీల్దారు, బేగి బేగి అని చేతులూపుతున్నాడు.

మా అయ్య సేరుకున్నాడు. బండి ఎక్కబోయాడు.

మరేముంది! పడిపోయాడు. బండికీ గేటు ఫారానికీ మధ్య పడి పోయాడు.

అయిపోయింది. తల పగిలిపోయింది. కాళ్ళు ఇరిగి పోయాయి. సేతులు ముక్క సెక్క అయిపోయాయి.

బండెల్లి పోతూంది.

తాశీల్దారు మా అయ్య పిక్కెటుని గేటు ఫారం మీదికి ఇసిరేసి. అక్కడున్న వోళ్ళతో, "ఆ పిక్కెటు వాపసుచేసి డబ్బు తీసుకోమని ఆడికి చెప్పండి" అన్నాడట.

ఆసపత్తిరికి తీసికెళ్ళేసరికే అయ్య పానం పోయింది. మరి తెలివి రాలేదు.

మా అమ్మతో ఒక మాటయినా చెప్పలేదు.

అంతే! సచ్చిపోయాడు.

అని యెంకడు రెండు గుటకలు వేశాడు. కంటికి ఎగబ్రాకుతున్న నీటినికడుపులోనికి పంపించివేస్తున్నాడా అన్నట్టు ఆ రెండు గుటకలూవేశాడు.

దమ్మ డేమనుకుంటాడో అని సిగ్గుపడ్డాడు పాపం! యెంకడు.

* * *

యెన్నాళ్ళిస్తారు ఆ గుమాస్త లయినా; అప్పుడణా, అప్పుడు కానీ! పాపం! యీరయ్యకొడుకు కదా అని.

నన్ను సూపించుకుంటూ అలాగా నాలుగునాళ్ళు గడిపింది; తరువాత ఒకరింటిలో పనికి కుదిరింది, మా యమ్మ.

మరే మమ్మతే! అయ్యతోనే పోయింది దాని బతుకంతా. సన్నగా పూతికపుల్లలాగయి పోయింది.

పాడుముండ దగ్గొకటి పట్టుకుంది.

దగ్గి దగ్గి ఆ దగ్గుతోనే మా అమ్మ అంతరించిపోయింది.

పాపం! సచ్చేముందు మాయేడిసింది! నన్ను సూసే యేడిసీది. నా బతుకేమవుతాదో అని ఏడిసీది.

మా పొరుగవ్వ నాలుగురోజులు సేరదీసింది – మా మంచితల్లి! పేదరాలు ముసిలిముద్ద – ఎలాగో కష్టపడి తెచ్చుకున్న దానిలోనే నాకింత పెట్టేది. తానింత తినేది.

అంతట్లో వొచ్చాయి మరిడిలాగా మసూసికాలు.

ఆ లిం డ యా

ఊరంతా నొల్లుకు పోతున్నాయి. ఎక్కడ సూసినా మసూసికాలే- ఎక్కడిన్నా సావులే.

నాకూ తగిలింది మసూసికం. మా జోరుగా తగిలింది. నన్ను బయటికి తీసీశారు. అవ్వకి జొరం.

దిక్కామొక్కా ; దగ్గరకొచ్చేవోళ్ళే లేరు

అందరు సచ్చిపోయారే, అలాగే నేను సచ్చుంటే ఈ బాధ తప్పేదే కదా.

నా రాత ఇలాగుంటే అలాగెందు కవుతాది ?

ఎలాగారోజులు గడిశాయో, దమ్మన్నా నే నెలాగ బతికానో ఆ పర మేశుడికే తెలుసు.

ఈ కన్నుపోయింది. సేతులూ కాళ్ళూ ఇలాగ వంకర్లు తిరిగి పోయాయి.

ఆ యవ్వే ఇంత గెంజి పోస్తుండేది.

తనెంట న న్నీడుసుకుంటూ ముస్టెత్తేది — నన్ను సూపుతూ

మరేదయినా దారుంటే గదా దమ్మన్నా ?

ఇందుకే నన్ను పుట్టించావా ఈశురుడా అని ఇలాగ ఈదులాడు కొస్తున్నాను.

అన్నాడు యెంకడు.

"ఇందుకే పుట్టించాడు. ఇందుకే" అని దమ్ముడు చాలా నెమ్మదిగా అన్నాడు.

"మరేం చెయ్యమంటావు సెప్పు ?" అని యెంకడు తెల్లబోయాడు.

# నారిగాడే దరిద్ర నారాయణుండు

యెంకడి కథ పూర్తిఅవుతూ వుంది. మరి నలుగు రయిదుగుఃః ముష్టి వాళ్ళు అక్కడికి వచ్చారు దమ్మడిని చూచి ఆశ్చర్యంతో దగ్గరకు పోయారు. యెంకడి కతలో లీనమయి అలాగే నిలబడి విన్నారు.

విని కళ్ళు తుడుచుకున్నారు. దమ్మడి ముఖం చూచి భయపడ్డారు. ఏడుస్తున్నట్టు కనబడితే ఏమంటాడో అని భయం. తమ కేమిటో అవు తుందని కాదు; దమ్మడు మరింత దుఃఖం పొందుతాడేమోననే వారి భయం.

అందుచేత అక్కడున్నవారింతా నిశ్శబ్దంగా ఊరుకున్నారు. చప్పుడు లేకుండా ఆ స్థలం ఒక సమాధిలాగా వుంది. అయితే ఇది సజీవ సమాధి.

* * *

వాళ్ళలో ఒక ముసలివాడు, బక్కచిక్కిన బరుగు – ఎంత సేపటి నుంచి పట్టివుంచాడో వూపిరి, ఒక్కసారి బయటికి వదిలాడు – క్రోధంతో పిట్టిపోతూవున్న పాము బుసకొట్టినట్టు బుస్సుమంటూ. ఒక్క అడుగు ముందుకువేసి ముసలివాడు, "దమ్మన్నా, యెంకడి సంగతికే ఇలాగుంటావు; ఈ నారిగాడి సంగతి యిన్నావా?" అని ఒక వ్యక్తిని ముందుకు తోశాడు.

ఆ బక్క ముసలివాడి ఊపుకే నారిగాడు మూతు బోగులుబోగి మోకాళ్ళమీద పడ్డాడు. కాలం విపరీతం ఇలాగా పరిణమించకపోతే, 30 సంవత్సరాల వయసులోవున్న నారిగాడేమిటి ? 80 సంవత్సరాలు పస్తులతో పోరాడుకుంటూవున్న ఈ ముసలివాడు తోసినంత మాత్రానికే ఇలాగా మోకరిల్లి పడిపోవడం ఏమిటి ?

* * *

ముప్పయియేళ్ళ నడియవ్వనం : చెక్కుకు చేరడు రక్తం వుండవలసిన వయసు; తిరగలి రాళ్ళలాగా చక్కకట్టి వుండవలసిన ఛాతీ : కండరాలు పెనవేసుకొని, కదలినప్పుడల్లా కలకల పలుకుతూ వుండవలసిన చేతులు: ఆ పాటి, ఈ పాటి సముద్రాన్ని అమాంతంగా దాటివేయలేనా అని పుట్టిపడుతూ వుండవలసిన ఉత్సాహం :

చూస్తూన్న వాళ్ళ హృదయాలను చూర తీసుకోవలసిన ఆకారం :

ఏవీ ? ఈ ముప్పయి యేళ్ళ నారిగాడిలో ?

అవి కళ్ళేనా? తమ ముందు కనబడుతున్న ఈ విశాల ప్రపంచంలో ఎక్కడా, ఏదీ దారీ కనబడలేదని నిరుత్సాహం పొంది, వెనక ప్రక్కను ఏదయినా గతి కనబడుతుందేమో అని చూడడానికి తలలో సొరంగం తవ్వుకుంటూ పోతూవున్నాయా అన్నట్టు కనబడతాయి.

తోలుపూత పూసిన ఎముకలగూడు ఆ శరీరం. ఒంట్లోవున్న ఎముకలన్నీ లెక్కపెట్టవచ్చును.

కాని ముండా కడుపు : నింపడానికి ఏదయినా పడేస్తే, నెమ్మదిగా వుంటుంది; అలా ఆహారం ఏదయినా ఇవ్వలేనప్పుడు ఈ కడుపే కటికి రాక్షసి అయిపోతుంది. తన శరీరాన్నే తాను కొరుక్కుతింటుంది. అలాగా కొరుక్కుతిని తిని ఇప్పుడు నారిగాడి కడుపు వెన్ను నంటుకుంది.

అలాంటి నారిగాడు అంత తూలి ముందుకు పడ్డాడంటే ఆశ్చర్యం ఏముంది?

* * *

దమ్మ డిదంతా చూచాడు. మెల్లగా లేవబోతూన్న నారిగాడికి చెయ్యూతిచ్చాడు. మళ్ళీ ఎగాదిగా చూచాడు నారిగాడి వాలకం.

నారిగాడి గుండెమీది కొచ్చేసరికి దమ్మడి దృష్టి ఆగింది—కాదు కొయ్యబారి పోయింది—స్తంభించింది.

ఎందుకా ?

ఎడమపక్క-ఎముకలమధ్య నారిగాడి గుండె కొట్టుకుంటూ వుండడం దమ్మడికి ప్రత్యక్షంగా కనిపించింది.

చూస్తూవుండగానే, ఆ గుండెకాయ చేసే చప్పుడుగూడా దమ్మిడి చెవులకు వినిపించింది__లబ్, డబ్, లబ్ డబ్ అని.

వింటూ వుండగానే దమ్మిడికి ఆ ధ్వనిలో విశేషార్థం ఏదో గట్టిగా తోచింది.

కంటిమీద ఏవో పొరలు కమ్మికనట్టయింది. చూపు చెదిరింది__అలుక్కొని పోయింది. దమ్మిడి కళ్ళు మరీ విప్పారిపోయాయి–భయానకంగాను.

* * *

దమ్మిడి కంటికప్పుడు కనిపిస్తున్నది నారిగాడు కాదు; దరిద్ర నారాయణుడు.

భారతదేశమంతటా వ్యాపించి సర్వవ్యాప్తిగా కనబడుతూవున్న బడుగు; బతికుండీ చచ్చిన వారికిందనే లెక్కకువచ్చే దరిద్ర నారాయణులు.

ఒక్కసారి, ఒక్కకట్టగా, లక్షలూ కోట్లూ కనిపించారు. భూమినుంచి ఆకాశందాకా ఈ దరిద్రశరీరాలే, ఏ దిక్కున చూచినా ఈ బడుగుదేహాలే.

దమ్మిడి కిది ఒక విశ్వరూప సందర్శనంలాగా కనిపించి వుంటుంది. నాడు కృష్ణుడి దయవల్ల అర్జునుడు చూచిన విశ్వరూపము అబద్ధం-కల్పన -కేవల ఊహానిర్మితం.

నారిగాడి మూలాన దమ్మిడు అక్కడచూచిన ఈ విశ్వరూప ప్రదర్శనం సత్యమైన రూపం; యథార్థం; అందరూ చూడగలిగినదే.

"అనేక బాహూదర వక్త్ర నేత్రం
పశ్యామి త్వా సర్వతోనంతరూపం
నాంతం నమధ్యం న పునస్తవాదిం
పశ్యామి విశ్వేశ్వర విశ్వరూపం

అదే దమ్మిడు చూచిన విశ్వరూపుడు చేతులు, కడుపులు, ముఖాలు, కళ్ళు లక్షలూ కోట్లూ, సర్వత్రా అవే అనంతంగా కనబడుతున్నాయి.

అంతం లేదు, మధ్యలేదు, అదిగూడా కనబడదు. (భూమి ఆకాశమూ నిండి పోయింది) అదే విశ్వరూపం— ఆ విశ్వరూపాన్నే దమ్మడు చూచాడు.

* * *

ఆ విశ్వరూపంలో లీనమయి పోయాడు దమ్మడు. దరిద్ర నారాయణుడిలో కనబడ్డ చిన్నెలన్నీ దమ్మడిలో కనిపిస్తున్నాయి. దమ్మడు అనుకరిస్తున్నాడు—దానిలో లీనమయ్యాడు కొబట్టి.

దమ్మడి ఒళ్ళంతా వొణుకు పుచ్చుకుంది. తొందర తొందరగా ఊపిరి తీస్తున్నాడు. కళ్ళనుంచి నిప్పులు రాలుతున్నాయి. పళ్ళు పట పటమని కొరుకుతున్నాడు. పెదవులు కొంచెం విడబడి పళ్ళు కనబడుతున్నాయి.

ప్రక్కను నిలిచిన ఆడది అలా నోరు తెరుచుకొని అలాగే స్తంభించి పోయింది. పిల్ల బిక్క మొగంవేసి తల్లిని బిగ్గరగా కౌగలించుకుంది.

చుట్టూ నిలిచినవాళ్ళు బొమ్మలలాగా నిలిచిపోయారు.

అంత భయంకరం!

దంష్ట్రా కరాళాని చ తే ముఖాని
దృష్ట్వైవ కాలానల సన్నిభాని
దిశో నజానే న లభేచ శర్మ
. ....... .. . . .

ఏమిటా భయంకరమయిన కోరలు! ఆ ముఖంనుంచి ప్రజ్వలిస్తున్న ఆ మంటలేమిటి? చూస్తే దిగ్భ్రమ కలుగుతూవుంది. తూర్పేదో పడమరేదో చెప్పలేకుండా వున్నారు.

గుండెలలో ఏదో దిగులు; ఏదో భయం, ఏదో దుఃఖం కలుగుతూ వుంది.

అంత కఠోర దృశ్యం. అంత విషాద ప్రదర్శనం.

దమ్మడి విశ్వరూప సందర్శనం అయింది.

దమ్మడు కొంచెం తల ఊపాడు; ఆ! అంటూ, ఊపిరి వదిలాడు.

దమ్మడు ఊపిరి తీసేటప్పటికి అక్కడున్న వాళ్ళ గుండెలమీద నున్న బరువు అంతా దిగింది చులకపడ్డారు.

తల్లిని కరుచుకొనివున్న పిల్ల మెల్లగా తల్లిముఖం చూచి "అమ్మా! ఊ!" అంటూ తల్లి చంకలో తల దూర్చుకుంది.

"పాపం! నారన్న సంగతేమిటి!" అని దమ్మడు ముసలాడి నడిగాడు. దమ్మడి చెయ్యి నారిగాడి ఎముకలు లెక్క పెడుతూ వుంది.

"సంగతని మెల్లిగంటావేటి దమ్మన్నా! అంతా మాయ. కలిమాయ; నా కళ్ళయెదట జరిగిన మాయ." పురాండాలూ కావు; పుక్కిడి కధలూ కావు నా కళ్ళతో సూసిన మాయ" అని ముసలివాడు మొదలుపెట్టాడు.

# నారిగాడి కథ

ఈ నారిగాడు–దమ్మన్నా–లేక లేక పుట్టాడా; మా ముద్దుగా పెంచారులే, పెద్దోడు పెద్దోడు అని. ఈళ్ళయ్య కొంచెం పచ్చ పచ్చగా బతికేవోడు. నాలుగు చెక్కల పొలం, చిన్న యిల్లు. అంతా బాగానే వుండేది; ఆ పాడు ముండా కరువొచ్చినదాకా.

అది కరువంటే కరువు కాదు. కాటకం. ఆ కరువులో పుట్టాడు నారిగాడు. చిన్నప్పుడే మా గొప్ప జబ్బు చేసింది ఈడికి. ఎలాగయినా ఈడికి ప్రాణాలు దక్కించాలని, దమ్మన్నా, ఈళ్ళ నాయన పెద్దోడు మా గొప్ప పట్టుపట్టాడు.

పట్నానికి తీసుకెళ్ళి డాకుటేరులను పెట్టి ఓ ఒకటేమిటి సరిగ్గా రెండు మూడు నెలలు సావుతో జగడ మాడాడు.

ఇక నది దబ్బుకాదు. డాకుటేర్లు అడగడానికి జంకుతారా? పెద్దోడు ఇవ్వడానికి ఎనకతీస్తాడా? కరణం సుబ్బయ్యను అడగడం. కాగితాల మీద యేలిముద్దర ఏపేయడం, పదీ ఇరవై తీసికొని పట్నం యెళ్ళడం, మందుకనీ, దానికనీ దీనికనీ–ఎంత కర్చు అయి దో పెద్దోడికి తెలవదు.

బిడ్డడి ప్రాణాలు దక్కడమే కావాల. ఏమైనాసరే అని ఊసున్నారు తల్లీ తండ్రిని.

పిల్లోడు దక్కాడు. ఊరి కొచ్చారు. ఎలాగంటావేటి? దమ్మన్నా భూమి; ఆకాశం అంతా గెలుచుకొని వొచ్చినట్టు వొచ్చారు.

అమ్మలక్కలికి పిల్లోడ్ని చూపించినప్పుడల్లా ఆ తల్లి బుజా లెగురు తుండేవి. ఇక పెద్దోడి సంగతా–చెప్పడానికి తరంగాదు.

* * *

పెద్దోడు మంచం పట్టాడు పాపం! కరువులకి కరామత్తులకి సుబ్బయ్యేసే జేడా పావులా ఇస్తుండేవోడు—ఏలు ముద్దరలు తీసుకుంటూ.

ఆ తల్లి ముండ—డాకుటేరు మందు డాకుటేరు మందిస్తే గాని బతకడని ఎంత మొత్తుకున్నా, ఎందుకులే, మన వూరి మందులు సాలులే అంటూనే వొచ్చారు పెద్దోడూ, కరణం సుబ్బయ్యాను.

జబ్బెక్కువయిపోయింది; వచ్చేప్రాణం పోయేప్రాణం అవుతూంది. సంకని బిడ్డనేసుకొని ఆ తల్లి ఏడుస్తుండడం దమ్మన్నా—మరసిపోదామన్నా మరప్పరాదు.

"అన్నిటికి సుబ్బయ్య బాబే వున్నాడు మనకన్యాయం సేస్తాడా" అని గుడ్డుకి గుడ్డెడు నీళ్ళు కార్చాడు. మరేమిటి జ్ఞాపకం తెచ్చుకొనే వోడో తెలవదు. మనకు అన్యాయం సేస్తాడా — అనే అంటుండేవోడు. తెలివి వున్నప్పుడూ ఆ మాటే, తెలివి లేనప్పుడూ ఆ మాటే.

సుబ్బయ్య—కరణం—"వాళ్ళకేం భయం లేదులేరా పెద్దోడా" అని బరోసా ఇస్తూనే వుండేవాడు.

* * *

ఆకరి గడియలొచ్చాయి. పెద్దోడు ఈ నారిగడిని చేతులతో తీసికొని —ఏమీ తీసుకోడంలే, చెయ్యి సాపడానికయినా శ.తెక్కడుంది?—"మన కన్యాయం సేస్తాడా" అని అంటూ గుడ్లు నిలబెట్టేశాడు.

ఇంటికప్పుమీద మరేమిటి కనిపించిందో ఆ దరమ తండ్రికి— దమ్మన్నా— నీ కబద్దం నాకు నిబద్ది— చెప్పుమని ఒక్క కేకేశాడు— దగ్గరున్న వోళ్ళ గుండెలు బద్దలయి పోయినట్టు.

సరి!

* * *

కరణం సుబ్బయ్యంటే ఘటికుడని అందరికీ తెలిసిన సంగతే. అయినా పెద్దోడు సచ్చిందాంకా అంత కరుకోటకుడని ఎవ్వడూ అనుకోలేదు.

యేలు ముద్దరల కాగితాల్ని, ఒకదానిమీద ఒకటి పెట్టి బాగా—ఇంత కట్ట—తెచ్చి ఆ తల్లి ముండ దగ్గర పడేశాడు. అదీ ఇదీ అంటూ లెక్కలు రాశాడు. తాను ఇంత సాయం చేశానన్నాడు; అంత సాయం చేశానన్నాడు; వందలూ నూర్లూ అప్పు తేల్చాడు.

దానికేం తెలుసు? తెల్లపోయింది; పిల్లోడ్ని కాగలించుకొని కన్నీళ్ళు కార్చేది.

పెద్దమనుషులను కనుక్కో అన్నాడు — కరణం సుబ్బయ్య. నిజమే.

పెద్దమని షెవడు? ఎవరికయినా నోరుంటేనా? కాదని చెప్పడానికి ఒక్కడికయినా ధైర్యంవుంటేనా? పోయినోడు ఏలాగా పోయాడు. ఈ కరుకోటకుడితో ఇరోదం మనకెందుకని అందరూ తలలూపేవోరే

కరణం సుబ్బయ్యమాట కాదనడానికి – మళ్ళీ ఆ దేముడే తిరిగి రావాలకదా!

* * *

ఏమయితేనేం దమ్మన్నా! ఆ నాలుగు మడిచెక్కలూ తన పొలంలో కలుపుకున్నాడు. ఇల్లు తన సోదీనం చేసుకున్నాడు చూడూ పాతూరిలో ఆ చివర చింతచెట్టుదగ్గరున్న ఇల్లు—అ దెవడిది?—ఈ నారిగాడిదే.

కష్టార్జితం లాగా, కట్టించాడు పెంకుటిల్లు. అదంతా పెద్దోడి ఇంటి మీదే.

తల్లి ముండను పట్నానికి తీసుకెళ్ళి రిజిస్టరీ సేయించుకున్నదాకా ఈళ్ళకి పైసా పరకా ఇస్తూ వొచ్చాడు

ఆ రవంత పని అయిపోయింది. ఇక నెందుకు? చేతులు దులపడం మొదలు పెటాడు సుబ్బయ్య. మరొక్క దమ్మిడీ ఇస్తే వొట్టు.

ఇప్పటికే నా కింత నష్టం వొచ్చింది, అంత నష్టంవచ్చింది, ఇంకా ఎంతకని ఇవ్వగలుగుతాను. మీరైనా చెప్పండి? అని వూరి "పెద్దమనుషుల" తో చెప్పుతాడు. ఆ పెద్దమనుషులు ఏమంటారు?

'అవునండి పాపం!' అని తల ఊపేవోరేగాని. అలాగంటే.

ఆ దిక్కుమాలినముండ ఏమైపోతాది ? అని అనేవోడు లేడు. సుబ్బయ్య మాట అంటే అంత భయం

దిక్కుమాలిన పక్షి !

తనా నా వోళ్ళు ఎవ్వరూ రేరు. చేతిని పిల్లోడు. బతకడం ఎలాగ? ఆళ్ళిచ్చిందీ, ఈళ్ళిచ్చిందీ తినుకుంటూ ఎలా ఉంటాది ?

ఈ ఇచారంతొనే పుల్లఅయిపోయింది ఆ ఊరిలొ బతకడం కష్టం అనిపించింది కదా మరి ! పువ్వు ఇమ్మిన ఊర్లో కర్ర లమ్మడం !

మా ఎడిసింది; మా ఏడిసింది. ఎంత ఏడుస్తే ఏం లాభం ! వినేవో ళ్ళెవరు ఆ ఊరిలో? నారిగాడమ్మతో మాటలాడుతున్నారని తెలిస్తే కరణం సుబ్బయ్య ఇరుచుకొని పడేవోడు. అంత శత్తురురాలయింది ఆ తల్లిముండ ఊరందరికి.

ఇక నక్కడ ఉండడం కన్నా, మరొక ఊరుపోయి ముష్టెత్తుకోడం మంచి దనిపించింది.

"ఎందుకీ బతుకు ? ఇలాగ బతకడంకంటే చస్తేనే మంచిది కదా!" అని ఏడ్చి ఏడ్చి. పిల్లోడి మొకం చూసేది. నస్తే ఈడి గతేమిటి? అని అనుకునేది, మరీ ఏడిసేది

ఆ ఏడుపుతోటే ప్రాణాలు కరికారిపోతుండేయి. జబ్బూ,జొరమూ, దగ్గు —— పిల్లోడి ఆకలి——ఏడుపు —— ఇవన్నీ భరించలేకపోయేది.—— పాపం ! సాయం చేసేవాడొక్కడూ లేడు.

ఒకనాడు రాత్రి సెప్పకుండా సెయ్యకుండా ఊరొదిలి పోయింది.

* * *

మెసవి కాలం. నడినెత్తిని ఎండ మండుతున్నాది. ముష్టికెళ్ళి తిరిగొస్తున్నాను. ఎండకు జడిసి పిట్టయినా బయట కనిపించదు.

ఆ యెండలో ఒక పొలం గట్టున పిల్లోడు ఏడుస్తూ ఉన్నాడు. తల్లి ముండ——ఎండు పుల్లలాగా——సొమ్మసిల్లి పడివుంది.

పరుగునపోయి చూశాను. నారిగాడూ, ఈడి తల్లీ !

దమ్మన్నా, ఏమడుగుతావు? నాకు ఎక్కడలేని దుక్కంవొచ్చింది. కోపం అనుకుంటా వేమిటో—కోపం కాదు. దుక్కమే. కోపం ఒకటా? బొచ్చె పట్టుకొన్ననాడే పోయింది కోపం! ఎవడిమీద కోపం. పడేవోడెవడు?

దుక్కమే—దమ్మన్నా—దుక్కమే.

అంత బతుకింత కొచ్చింది కదా అని దుక్కమే. నమ్మినందు కింత సామిద్రోహం చేశారే. అని దుక్కమే—దమ్మన్నా—దుక్కమే!

అని ముసలివాడు అంటూవుంటే. ఆ కన్ను గుంటలలో నుంచి మంటలు బుస్సుమంటూ వస్తున్నట్టు కనిపించింది.

దమ్మన్నదృష్టి ఆ కళ్ళమీదనే నిలిచింది. శాంతించు శాంతించు అన్నట్టు దమ్మన్న అతడివీపు తట్టుతున్నాడు. దమ్మన్న ఏనుకుంటూ ఉండిపోయాడు.

# సుబ్బిగాడి కథ

అక్కడున్న ముష్టివాళ్ళలో కొంచెం సద్దు వినిపించింది. చింత నిప్పుల నాగా ఉన్న కళ్ళను దమ్మన్న అటు తిప్పాడు "ఏమిటా సందడి" అని అడిగినట్టు. ఆ కళ్ళు చూసేసరికి ఎవరిమన్నవారు గుప్‌చిప్ అయి పోయారు. ఒక్కొక్క ముఖం చూశాడు. దమ్మన్న ఆ ప్రశ్నతోనే— కళ్ళల్లో. ఎవ్వరూ జవాబు చెప్పరు. దమ్మన్న బొమలు ముడిపడు తున్నాయి "అబ్బా! ఈ అడుక్కుతినే ముష్టివాళ్ళతో బతకలేకుండా ఉన్నాం" అన్న బోడమ్మ మాటలు దమ్మడి చెవులలో—కాక మెదడు లోనా—రింగుమంటున్నాయి. పక్కనున్న పిల్ల కావుమని ఏడ్చింది. అక్కడున్న ఆడది ఒకడినిచూచి "చెప్పు" అన్నట్టు తల ఊపింది. వాడు ఒక గుటక మింగి సర్దుకున్నాడు.

"మన సుబ్బిగాడేదో చెప్పాలనుకుంటున్నాడు" అని అన్నది ఆడది

దమ్మడి పళ్ళ సందుల్లోనుంచి "ఏమిటి సుబ్బన్నా? సుబ్బన్నా" అన్న మాటలు బయటి కొచ్చాయి.

"మరేమీ లేదు దమ్మన్నా, సెప్పాలనే అనుకుంటాను గాని, నా సంగతి నాకే సిగ్గుగా కనబడతాది—ఎందుకు సెప్పడం అని వెనక తీస్తాను" అన్నాడు సుబ్బిగాడు.

"ఆ సిగ్గు మనకొద్దు. అది మన సంఘానికి, ఆ పెద్ద పెద్ద పేరు లున్నవారికి. మనకెందుకు సిగ్గు? సిగ్గూ—లజ్జా—అభిమానమూవున్న లోకం అయితే, మనకూ అవి ఉంటాయి. అవి వాళ్ళకే లేనప్పుడు మన

కెందుకు ? చెప్పు" అన్నాడు దమ్మన్న చిన్న విషపునవ్వుతో—కళ్ళ లోని ఎర్రదనం కదలయినా లేదు.

"అయితే సెప్తాను—అమ్మా, మరేమి అనుకోకండి" అని అక్కడున్న ఆడవారికి ఒక్క నమస్కార బాణం పడేసి తనకథ ఆరంభించాడు....

"ఏమీలేదు.... నేను మేజిస్ట్రేటు కచ్చేరీలో నౌకరీ చేస్తుండేవాడిని. నాతో కలిసి ఆరుగురం నౌకర్లం—మేజిస్ట్రేటుగా రింటి తైనాతీ నౌకరి మేమంతా వొంతులుమీద చూసుకుంటుండే వారం.

నా వొంతొచ్చే టప్పటికి, మేజిస్ట్రేటు గారికి మూడో పెళ్ళి అయి, పెళ్ళాం కాపరానికొచ్చింది—ఆ మేజిస్ట్రేటును కట్టుకున్న తల్లి ఒక్కర్తయినా పదేళ్ళపాటు కాపరం చేసి ఎరగదు; అందుకే అతణ్ని పెళ్ళాలపులి అనేవారు.

నేనింటి తైనాతీ కెళ్ళిన దగ్గరనుంచీ అయమ్మ చెప్పే పనులకూ, బెత్తాయించే పనులకు అంతూ అపూ ఉండేదికాదు. అక్కడి దిక్కడ ఈ వేళ పెడితే, రేపు ఇక్కడి దక్కడ—అంతే—ఇంట్లోవున్న సామానులూ, బిరువాలూ, అలమరలూ అన్నీ అలా రోజుకు రోజు, గడియకు గడియ మారుస్తూ ఉండవలసిందే.

వేసిన సున్నం వేస్తూ ఉండవలసిందే. తోమిన గిన్నెలు తోముతూ ఉండవలసిందే. వంకాయలు తేవడాని కొకసారి, అందులో ఒకటి ముదురుగా ఉందని దాన్ని తిరగగొట్టడాని కొకసారి — ఇలాగా ఇంటికీ బజారుకీ ఎడ తెరిపి లేకుండా తిరగడం నా పని.

ఏం చేయగలం అని ఈ ఒళ్ళు నాది కాదని కష్టపడే వాడిని. పల్లెత్తు అనేవాడిని కాదు.

మేజిస్ట్రేటుగారు కమాను వెళ్ళినపుడు తైనాతీ వరస నాది కాక పోయినా అమ్మగారు కోరారట—అయ్యగారుఆ ర్డరిచ్చారు.—నేనే తైనాతీ ఉండాలనీ. ఆ ఆర్డరే లేకపోతే నేనే కమానుపోయేవాడిని నాలుగు రాళ్ళు సంపాదించుకొని వచ్చేవాడిని. ఆ మాఘమాసంలోనే పెళ్ళిగూడా చేసుకో

వాలనుకున్నాను రైతుల దగ్గరా కర్ణాల దగ్గరా ఏదో అడుగుకుందాం అనుకున్నాను. ఒక్కడిన్ని కిదా? తల్లా? తండ్రా? నేనే చూసుకోవాలి

అయినా, అమ్మగారి కోరిక—మనమీద దయవుండబట్టే కదా వాళ్ళదయవుంటే మనకేం కావాలి నాలుగు ఏళ్ళలో దఫేదారు కాకపోతానా అన్న ఆశ

ఏమయితేనేమి ? తప్పుతాది గనకనా, ఎళ్ళాను తైనాతీ వరసకి.

* * *

అయ్యగారెళ్ళిన దగ్గరనుంచి, దమ్మన్నా అదే కబుర్లు ఆరంబించింది అమ్మగారు. పెళ్ళిళ్ళమీద విరగబడి తిట్టింది. ముసలోళ్ళు పెళ్ళెందుకు చేసుకోవాలా అని తిట్టి దీవించి తూర్పారపట్టింది.

ఇదేమిరా దేవుడా అని మాటలాడకుండా ఊరుకొనిఊకొడుతున్నాను.

ఏమనుకుందో అమ్మగారు. సుబ్బయ్యా బజారుకెళ్ళి అదితే, ఇదితే అని ఒక బండెడు సామాను తెమ్మంది.

ఆ తిట్లు వినడం తప్పిందికదా అని బజారెళ్ళాను. తిరిగి వచ్చే వరకు రాత్రి ఎనిమిది గంటలయింది.

గాడిదబరువు సామాను—కూలివాడిని పెడితే ఏమి కోప్పడతాదో అని అంతా నేనే మోసుకొచ్చాను.

వచ్చి సామానంత వొప్పగించి చెమట తుడుచుకుంటూ వుంటే అమ్మగారు "ఏమి సుబ్బయ్యా. ఇంత సామాను నువ్వే మోసుకొచ్చావా? కూలివాడిని పెటలేకపోయావా?" అంది అమ్మగారు.

"ఆ ; ఈ భాగ్యానికి కూలివాడెందుకమ్మా" అని మిగిలిన చిల్లర లెక్కపెట్టి యివ్వబోతున్నాను.

"ఆ చిల్లరకేమి తొందరొచ్చిందిలే—వుండనియ్యి. పాపం—ఇంత రాత్రయింది. ఇప్పుడింటికివెళ్ళి మళ్ళీ రావడం ఎందుకు ? ఇక్కడే తిని పడుకో" అంది అమ్మగారు.

ఆ ! ఎందుకమ్మా. అయిదు నిమిషాలలో రాకపోతానా" అని అన్నాను. అమ్మగారు వినలేదు. దయతో తిండి పెడతానంటే కాళ్ళ తన్నుకొనెళ్ళడం మంచిదికాదు—అదీకాక—అమ్మగారికి కోపం వస్తాదేమో అని ఊరుకున్నాను.

*　　　*　　　*

వంటవాడు వడ్డించాడు తిన్నాను. ఆకెత్తి పారేసి సుద్ది పెట్టాను. వంటవాడు వంటిల్లు తాళంవేసి, వొల్లెవాటు సదురుకుంటూ ఇంటికి బయలు దేరాడు. వీధితలుపు వేసేదాం కదా అని నేనూ అతని వెంటనే నడుస్తున్నాను.

హహ ! అని వంటవాడు సకిలించాడు. తిండెక్కువయింది గాబోలు అనుకున్నాను. గుమ్మం దాటుతూ ఆ వంటవాడు "కొట్టావుడావ్—తలుపేసుకో" అని అన్నాడు. మొదటన్న మాటకు అర్థం ఏమిటో నాకు తెలవలేదు—తలుపుమాత్రం వేసుకొని వరండా మీదికిపోయాను.

ఒకమూలను ఒక చాపగుడ్డ వేసుకొని చేరబడుతూ ఉన్నాను. లోపల నుంచి "ఏమి సుబ్బయ్యా, వంటవాడు వెళ్ళాడా"? అని ప్రశ్న.

"మరేనమ్మా" అని చేరబడ్డాను

లోపల గ్రామఫోను వాగుతూ ఉంది. ఆ పాట వింటూనే నిద్ర పోయాను.

*　　　*　　　*

సుబ్బయ్యా, సుబ్బయ్యా అన్న పిలుపుతో—మరి చేతితో తట్టిందో, కాలుతో తట్టిందో అమ్మగారు, చెప్పలేను—తెలివొచ్చింది.

ఆ అమ్మా అనుకుంటూ లేచాను.

"ఇలారా సుబ్బయ్యా" అంటూ అమ్మగారు గదిలో కెళ్ళారు.

నేనూ నాలుగడుగు లేశాను.

"నాకు నిద్ర పట్టలేదు, సుబ్బయ్యా" అంది అమ్మగారు. దానికి మనం చెప్పవలసిం దేముందని నే నూరుకున్నాను.

"ఊరుకుంటావేం" అంది అమ్మగారు.

"ఏమి చెయ్యమంటారమ్మా" అని బెదురుతూ అడిగాను.

"కొంచమైనా కనికరించొద్దా" అంది అమ్మగారు.

"ఎంతమాట సెలవిచ్చారు, కనికరించేపాటివారమా" అన్నాను నేను.

"కాదు సుబ్బయ్యా—నీకు పెళ్ళయిందా ?"

"లేదమ్మా, ఈమాఘమాసంలో చేసుకుందామనిఅనుకుంటున్నాను."

"అలాగా, అయితే నీ పెళ్ళికి మంచి సాయం చెయ్యాలన్నమాటే"– అంది అమ్మగారు నవ్వుతూ

"ఏదో కనిపెట్టుకొని వున్నవాడనుకదా" అన్నాను.

అమ్మగారు మరికొంచెం నవ్వి "నిన్ను చూస్తే నాకు చాలా సర్దాగా ఉంటుంది సుబ్బయ్యా" అంది.... "నువ్వు కనిపెట్టే ఉంటావు.........మీ అయ్యగారున్నారు గాని— ఎందుకు ? ఉత్త బూరుగుబుంగ."

ఇంకా ఏమేమో చెప్పుతూ ఉంది. నా ప్రాణాలు ఎగిరిపోతున్నాయి. పాదాల కింద నేల పగిలిపోతున్నట్టయింది.

"అమ్మా—"

"అమ్మకేంగాని, ఇలా దగ్గరగా రా, భయం లేదు రా" అంది అమ్మగారు.

నా వొళ్ళు ఒణుకుచ్చుకుంది.

"అమ్మా తల్లిలాంటివారు— తగదు రక్షించండి" అని అంటూ నేను నా పక్కదగ్గరకు పోయాను.

"రమ్మంటే రావుకదూ ?" అంది అమ్మగారు గద్దించి. నేను మరి మాట్లాడితే వొట్టు. బెదిరించింది. మీ చిత్తం అని ఊరుకున్నాను. "చూడు నిన్నేమి చేస్తానో" అంది. ఏమి చేసినా సరే, ఈ పని మాత్రం వొద్దు అని ఊరుకున్నాను.

బయటికి వచ్చింది— లోపలికి వెళ్ళింది— దగ్గరగా రాబోయింది అమ్మగారు, లాభం లేకపోయింది.

గదిలోనికి పోయి గభీలున తలుపు మూసి గడియ పెటింది.

బ్రతుకు జీవుడా అని ఊపిరి తీశాను.

* * *

మరునాడు వంటవాడు కన్ను గీటాడు నా ముఖమే జవాబు చెప్పి ఉంటుంది. మాట్లాడకుండా వెళ్ళాడు.

అమ్మగారు నన్ను చూడరుకదా నాతో మాటలాడరు. ఏమయినా చెప్పవలసివస్తే మరెవ్వరయినా చెప్పాలి; అమ్మగారు చెప్పరు. కోపం పట్టలేకుండా ఉన్నారు.

మూడురోజు లయిన తరవాత అయ్యగారొచ్చారు.

తైనాతీ వరస మారింది. అమ్మగారిదగ్గర సెలవు తీసుకొని వెళ్ళాను.

ఇంటికి వెళ్ళి ఆఫీసుకు పోయేసరికి పోలీసు హెడ్డు నన్ను అరెస్టు చేశా నన్నాడు.

మేస్త్రీటుగారి ఇంటిలో ఏదో నగ నేను దొంగిలించానట !

నెత్తీ నోరూ కొట్టుకుంటే మాత్రం ఏం లాభం! ఈడ్చుకుపోయారు లాలించారు బెదరించారు. ఎక్కడ దాచావో చెప్పమని.

ఇల్లు సోదా చేశారు. ఆ మూల పెట్టెకింద ఒక గోతిలో ఆ నగ దొరికింది.

కోర్టులో విచారణ జరిగింది. నేరం రుజువైంది. నాకు శిక్ష కఠినశిక్ష వేశారు.

ఖైదులో ఉండగానే, మరొక లంచం కేసు, మరొక దొంగతనం కేసు ...ఏవేవో కేసులు నడిచాయి. నా శిక్ష రోజు రోజుకి పెరిగిపోయింది.

అమ్మగారేమి చెప్పారో, అయ్యగారు ఏమి చేశారో అదంతా భగవంతుడికే తెలియాలి.

నాకు ఖైదు – కఠినశిక్ష – మూడేళ్ళు సాగింది.

అక్కడే నాకూ చుక్కిడికీ కలిసింది. ఇద్దరం ఒక్కమారే బయటి కొచ్చాం. వచ్చేమి లాభం - కరువు మహాకరువు. చెయ్యడానికి పనిలేదు. బ్రతకడానికి దారిలేదు.

ఇద్దరం కూడబలుక్కొని కన్నానికి బయలుదేరాం. ఎన్నడెరగని వాళ్ళం అయిపోయి, దొరికిపోయాం.

మళ్ళీ శిక్షేశారు.

ఆ శిక్షలో దాపరించింది ఈ గుండెదడ.

పని చెయ్యలేను పాటూ చెయ్యలేను. ఏమైనా అంటే గుండె కొట్టుకుంటాది.

దడలేనప్పుడు అడుక్కోడం, దడవొస్తే చచ్చిన పీనుగులాగా అలా ఎక్కడో పడివుండడం ఇలాగయింది దమ్మన్నా నా సంగతి.

అని సుబ్బిగాడు గుడ్డుకి గుడ్డెడు నీళ్ళు కార్చాడు.

విన్నవారంతా "అలా గుందిలోకం" అన్నారు.



# అంకమ్మ ఎందుకు అడుక్కోవలసి వచ్చింది?

ఏం? అంకమ్మా, అలా గుడ్డుకి గుడ్డెడు నీళ్ళు పెట్టుకుంటున్నావు? అని దమ్మడడిగాడు.

అంకమ్మ—ఎముకల పంజరంలాగా నిలబడి వుంది. అంకమ్మ చంకలో తల పెట్టుకొని తన బిడ్డ — ఆడదో, మగవాడో చెప్పలేము— నిలుచుంది. ఇద్దరి తలలూ ఎండిపోయిన పుడక చెముడు దుబ్బులులాగా వున్నాయి. చినిగి చిల్లులు పడ్డ చిన్న గుడ్డలు, ఆ శరీరాలను కప్పి కప్ప డానికికూడా చాలక. బిక్కమొగం వేసుకొని ఊరుకున్నాయి.

దమ్మడు అడిగేసరికి గుడ్డున ఉన్న నీళ్ళు గోలాలయి కిందకు దిగ జారాయి చాలుగా. అంకమ్మ ఒక్క ఎగ ఊపిరి తీసింది. చంకలోని బిడ్డ బావురుమని మరింత తల్లి కడుపులో దూరిపోయింది.

"చెప్పు! అంకమ్మా! చెప్పు" అని అక్కడున్నవారిలో ఒక రిద్దరన్నారు.

మాటలాడలేకనో ఏమో దమ్మడు మహాబరువుగా తల ఒకవైపు ఎగరవేశాడు "చెప్పు" అన్నట్టు.

"ఏమి చెప్పడం దమ్మన్నా, చెప్పకుంటే సిగ్గు-తండ్రిలాటి వాడివి; అడుగుతున్నావు. అందరూ చెప్పుతుంటే, నేనేనా గనకారం చెప్పకుండా

ఉండటానికి ? అని చెప్పుచెతున్నాను, ఈపాటి అడిగిన వాళ్ళయినా, మా కెవ్వరున్నారు దమ్మన్నా?

"పెళ్ళయిన రెండోయేడు, మా అమ్మగారింటికి వొచ్చాను — పెద్ద పండుగకి. నా మొగుడు పంపనంటే పంపనన్నాడు. ఎంతో బతిమిలాడితే పంపించాడు — పదిరోజులలో బేగి రమ్మనమని. వొచ్చిన మూడోరోజునే మా అమ్మ నాయుడుగారింటిలో కసవూడుస్తూ కాలుజారి పడ్డది. మక్క ఇరిగిపోయింది నడాలేదు; కదలాలేదు.

"మరి నాయుడుగా రింటిపని ఎలాగవుతాది. ఆ యిల్లు వొదులుకుంటే అమ్మకు నోటికి గంజికూడా ఉండదు. 'అమ్మమ్మా నాయుడిగారింటిపని కొంచెం నువ్వు చూస్తూ వుండుతల్లీ; నాలుగురోజులు — నేను కొంచెం కదలాడినదాకా' అని చెప్పలేక చెప్పలేక చెప్పింది. మా అమ్మ — చింత మగ్గు పట్టించి పిడకనిప్పుతో మక్క కాపుతూ ఉంటే.

"అలాగే ఎల్తానులే అమ్మా" అన్నాను ఎళ్ళాను. రెండురోజు లయిందో లేదో, నాయుడు కొడుకు నా దిక్కే సూడడం ఆరంభించాడు. చీటికీ మాటికీ అంకూ అంకూ అంటూ పిలుచుకుంటూ ఉండేవాడు. ఆడిజిమ్మ తిరగబడా; ఆడికళ్ళు కాకులెత్తుకుపోనూ, ఇచ్చకాలాడి అదిచ్చీ. ఇదిచ్చీ, మీ అమ్మకెలాగుందనీ — అన్నీ బొల్లిమాటలే — నమ్మించి నా గొంతుకు కోశాడు — ఈడి శిరుసు వెయ్యిచెక్కలయిపోనూ, నన్ను గోతిలో తోశాడు. నా అంత అందంగా బోగం వోళ్ళయినా ఉండరనే నన్ను మంచీ శాడు దమ్మన్నా — ఈడిని ఆ దేముడెలాగా కాస్తాదో .

"బాగానే కాస్తాడు — మరా దేముడెందుకున్నాడు ? వాళ్ళని కాయ డానికి కాకపోతే — వాళ్ళు నిలిపిన దేవుడేనా ? మరొకడా ?" అని లోగొంతుకలో అన్నాడు — దమ్మన్న, గుడ్లుమాత్రం చింతనిప్పులలాగా ఉన్నాయి.

వెక్కి వెక్కి; వరదగా ఏడుస్తూవుంది అంకమ్మ.

"డబ్బు గర్వం!___ఎవరేమయిపోతారో అన్నమాటే ఉండదమ్మా ఈ పాడుముండావోళ్ళకి___ఎంత సేవ్హా ఆళ్ళ కులాసాలే సూసుకుంటారు." అని పక్కనున్న ఆడగొంతుకులు వినిపించాయి.

అంకమ్మ నోటిదగ్గర గుడ్డ పెట్టుకుంటూనే ఎడమచేతిలో బిడ్డ తల తడుముతూ. "ఈడు కడుపులో పడ్డాడు. మొగుడు ___ అసలే ముక్కోపి -ఇడిసి పెట్టాడు.___తిట్టీ,ఈది ఎక్కించి తన్ని మరీని. తల్లి, తరిమిసింది. దగ్గరికి రానిచ్చినోరే కనబడ లేదు. రామ రామ! నిరాదారం అయిపోయాను. ఆ చెట్టునున్న పచ్చికయినా ఒక ఆదరు వుంది. నా కదీ లేదు.

"ఊళ్ళో ఉండ లేకపోయాను___పోయాను!పోయాను___ఎక్కడికో తెలదు___ఎందుకో తెలదు. పోయాను.

"సచ్చిపోదునా అని లచ్చసార్లు అనుకునేదాన్ని. కాని, కడుపులోని కండను తల్చుకొనేసరికి, మరినాకు గుండెలుండేవి కావు. సావాలేక, బతకాలేక అలా గీడుసుకుంటూ పోయాను.

"నాలుగోనెలా, అయిదో నెల వొచ్చిందాకా, ఎలాగో కూలీనాలీ చేసుకునేదాన్ని" ఇంత గంజి తాగి. ఎవరిపంచనో పడుకునే దాన్ని. తరవాత తరవాత నన్ను చూస్తూనే ___ నువ్వేమి పని చేస్తావు పొమ్మనేవోరు___నవ్వుకునేవోరు. ఆసికాలాడడం ఆరంబించేవోరు కొందరు___ఆహా! దమ్మన్నా! ఏమి సెప్పమంటావు నాఅవస్థ?" అని అంకమ్మ మొఖం అంతా మూసుకొని వెక్కుతూ వుంది.

"అవును ; ఎన్ని ఆసికాలయినా ఆడతారే ! ఆళ్ళకేం పోయింది. కడుపు సూపుకొని బతుకుదామా అంటే, కడుపుసేసినోడు గడపలేక పోయాడా అంటారు" అని పక్క నున్న వాళ్ళు అందించారు.

"అన్నారమ్మా! అన్నారు. ఆ మాటలేనా? ఎన్నిమాటలు! ఎన్నిమాటలు! ఇనలేము, బరించలేము—అన్నీ అన్నారు! పడ్డాను, పడ్డాను. మొండికట్టైపోయాను. ఈ కండనే సూసుకున్నాను. ఆ అమ్మకింత సాయం చేసి, ఈ అమ్మకి పేలు సూసి, ఎలాగో బుక్కెడు గంజి తాగుతూ ఉండేదాన్ని.

"దానికిగూడా ఓపిక లేకపోయింది. సేతులూ, కాళ్ళూ వాచిపోయాయి ఎనిమిదో నెల. అలాగే ఆళ్ళ పంచను మూలుగుతూ ఉండేదాన్ని. తిండిలేదు, కడుపులో తట్ట కొట్టుకుంటూ ఉండేది. ఏమని సెప్పమంటావు? దమ్మన్నా! రుబ్బురాళ్ళలాగా అయిపోయినాయి పేతులూ కాళ్ళూను. కదలడానికే కష్టం. ఏం చెయ్యను? అలాగే ఈడుసుకుంటూ ఆ యింటికీ, ఈ ఇంటికీ ఎల్లే దాన్ని మాదాకబళానికి" అన్నది అంకమ్మ

"మాదాకబళం" అని దమ్మడి గొంతు లోతులోనుంచి ఒకగుర్రు వినిపించింది అందరు గక్కురుమన్నారు. "మాధవకబళం అట" అన్నాడు తరువాత దమ్మడు పళ్ళ సందులలో నుంచి. "పిడికిలి దులిపే పిండాకూటికి ఎంతపేరు పెట్టారు పెద్దలు!" అని హుంకరించాడు దమ్మడు.

"పేరేమిటి దమ్మన్నా, మొట్టమొదట ఆ సేతులూ కాళ్ళూ, ఆ కడుపూ ఈడుసుకుంటూ, గుమ్మంముందు అమ్మా, అని గట్టిగా పిలిసి, పిడికెడన్నం పెట్టు తల్లీ అని మొట్టమొదట అడిగినప్పుడు, దమ్మన్నా నావొళ్ళంతా సచ్చిపోయిం దనుకో" — అని అంకమ్మ మళ్ళీ కళ్ళు తుడుచుకుంది.

"అప్పుడు ఒళ్ళొక్కటే చచ్చిపోయింది. మనసు ఇంకా బతికి వుండేది." అన్నాడు దమ్మడు. "ఇప్పుడో, ఆ మనసుకూడా చచ్చిపోయింది

రాళ్ళం, బండరాళ్ళం అయిపోయాం. లోపలా, బయటా ! లక్షసార్లు మాదాకబలం అమ్మా అని అడుక్కున్నా, గుండెలో గలుక్కు మనదు— అందులో ఏమయినా ఉంటేనా? రాయిబారి పోయింది" అని దమ్మ దన్నాడు.

అంకమ్మ అందుకుంది. "రాయా, పాషాణం అయిపో యాను. అలాగే అడుక్కుంటూనే. ఈడిని కన్నాను. ముష్టి ఎత్తుకుంటూనే ఈడ్ని పెంచాను. పురిటితోనే దాపరించిది ఈ పాడురోగం — దానితో పనికి పనికిరాకుండా పోయాను.-మాకింతే రాశావా దేముడా—అనుకొని ఇలాగా బతుకుతున్నాము దమ్మన్నా !" అని అంకమ్మ తన కథ ముగించింది.

"బతుకుతున్నాము" అన్న మాట చెవిని బడేసరికి తుళ్ళిపడ్డాడు దమ్మడు. కళ్ళలో నుంచి నిప్పులు పెళ్ళున రాలాయి—"ఇదీ బతు కేనా" అని కాటోలు.



## తాతాజీ రచనలు

| | |
|---|---|
| 1. దేవాలయాలమీద బూతుబొమ్మలెందుకు ? | 5.00 |
| 2. పెళ్లి దాని పుట్టుపూర్వోత్తరాలు | 5.00 |
| 3. రాలూ – రప్పలూ | 6.00 |
| 4. పాత పాళీ | 6.50 |
| 5. మబ్బు తెరలు | 3.00 |
| 6. ఇనుప కచ్చడాలు | (ప్రతులేదు) |
| 7. కొత్త పాళీ | (అచ్చులో) |
| 8. సాహిత్య మొర్మొరాలు | ,, |



తాపీ ధర్మారావు

జననం : 19-9-1887 : : మరణం : 8-5-1973